







New

Teeth Cleaning Unit

'Kashmir'

TOOTH PASTE
TOOTH POWDER
and
TOOTH BRUSH

by

THE NATIONAL TRADING CO.

Manufacturers of

KASHMIR SNOW BEAUTY AIDS

BOMBAY-2. MADRAS-32.

# శీఘ్రంగా అన్ని రకాల బాధల ఉపశమనం



వీపునొప్పి :
అమృతాంజనాన్ని వీపు, మెడ, భుజాంతర, మర్దనా చెయ్యాలి.



బెణుకులు :
బెణికినచోట అమృతాంజనం మర్దనా చెయ్యాలి. వేడినీళ్ళతో కాపడంకూడా పెట్టవచ్చు.

75 ఏళ్ల పైగా ప్రఖ్యాతి చెందిన

అమృతాంజనము

# అమృతాంజనము




AMR-










Horlicks
THE IDEAL FOOD DRINK FOR ALL AGES




Shilpi SOM 8A/68 Tel

# ప్రత్యేక సదుపాయం!

సరకు ఉన్నంత వరకే

**60 పైసల ఖరీదైన ఆకర్షణీయమైన ప్లాస్టిక్ గ్లాసు 10 పైసలకు మాత్రమే ఈ డబ్బాలో లభిస్తుంది**







ఈ లేబుల్‌ను చూడండి

బలము, శక్తి
మరియు
రుచికోసం—
త్రాగండి
బోర్న్‌విటా!

Bensons-0460 TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల పరిచయవ్యాఖ్య ఫోటోలు కొందరు పాఠకులను ఇబ్బంది పెట్టి నట్టు కనబడుతుంది. ఎడమ వైపు బొమ్మలో ఉన్న మొక్కను పూల మొక్క అనుకున్నారు చాలామంది. కొందరు మటుకు పత్తిమొక్క అను కున్నారు. నిజాని కది గోరింటమొక్క. ఆ సంగతి గ్రహించిన పాఠకులు తప్పు వ్యాఖ్యలు పంపలేదు. బొమ్మలలో పాఠకులకు అస్పష్టమైన విషయా లున్నప్పుడు వ్యాఖ్యలు ఆ విషయాలకు సంబంధం లేకుండా రాయటం మంచిది.

సంపుటి 43 నవంబర్ '68 సంచిక 5

CHITRA



# భారత చరిత్ర



రణ్జిత్‌సింగ్ అనంతరం సిక్కు రాజ్యంలో అరాజకం ప్రబలి, సిక్కు సింహాసనం మీద ఎవరూ స్థిరంగా కూర్చోలేకపోయారు. చివరకు 1843 లో దలీప్‌సింగ్ అనే మైనరును గద్దె ఎక్కించి, రాజ్యాధికారాన్ని అతని తల్లి అయిన రాణీ ఝిందాన్ వశం చేశారు. అయితే నిజమైన అధికారం ఖాల్సా సేనల చేతిలో ఉంటూ వచ్చింది.

ఖాల్సా పొగరు అణచటం లాహోరు "దర్బారు"కు అత్యవసర మనిపించింది. ఇందుకు తగిన మార్గం కూడా దొరికింది. బ్రిటిషువారు పెద్ద ఎత్తున సిక్కు రాజ్యాన్ని ఆక్రమించే యత్నాలు చేస్తున్నట్టు కనబడ్డారు. "దర్బారు" వారు సిక్కు సేనలను బ్రిటిషు ప్రాంతాల మీదికి ఉసికొల్పారు. 1845 డిసెంబరు 11 న ఖాల్సా సేనలు సట్లెజ్ దాటాయి. వైస్రాయి హార్డింజ్ యుద్ధ ప్రకటన చేశాడు.

మొదటి యుద్ధం ముడ్కీ వద్ద అతి భయంకరంగా జరిగింది. సిక్కులు చూపిన అద్భుత పరాక్రమం వారి సేనాపతి అయిన లాల్‌సింగ్ యొక్క అవివేకం మూలంగా అపజయానికే దారి తీసింది. ఆ యుద్ధంలో సిక్కులు తప్పక గెలవవలిసింది. డిసెంబరు 21 న ఫిరోజ్ షా అనే చోట జరిగిన యుద్ధంలో ఇంగ్లీషు సేన మరింత హీన స్థితిలో ఉండి కూడా, సిక్కు నాయకుడైన తేజసింగ్ అకస్మాత్తుగా యుద్ధరంగం నుంచి నిష్క్రమించటం వల్ల విజయం పొందగలిగింది.

1846 జనవరిలో సిక్కులు మరొకసారి సట్లెజ్ దాటి లూధియానా పై దాడిచేశారు. ఈ యుద్ధంలోనూ, దీని వెంబడి జరిగిన యుద్ధాలలోనూ సిక్కుసిపాయిలు ఎంత వీరోచితంగా పోరాడి కూడా, సేనానాయకుల అసమర్థత వల్ల ఓడిపోయారు. (సిక్కు సేనాపతులలో షామ్ సింగ్ అన్నవాడొక్కడే

86. సిక్కురాజ్య పతనం

సమర్థుడు.) జనవరి 28 న ముగిసిన యుద్ధంలో విజయం పొందాక బ్రిటిషు సైనికులు అనేకమంది సిక్కులను కసికొద్దీ వధ చేశారు.

బ్రిటిషువారికి భారతదేశంలో సిక్కులు కలిగించినంత తీవ్ర ప్రతిఘటన మరెవరూ కలిగించి ఉండలేదు. ఫిబ్రవరి 20 న బ్రిటిషుసేనలు లాహోరు ప్రవేశించాయి. తరవాత జరిగిన సంధిలో సిక్కులు సట్లెజ్‌కి ఎడమపక్కన ఉన్న తమ ప్రాంతాన్ని ఇంగ్లీషు వారి పరం చేశారు. కాశ్మీరూ, హజరా ఇంగ్లీషువారికి పోయాయి. సిక్కు సేనలు పరిమితం చేయబడ్డాయి. మైనరు మహారాజు రక్షణకుగాను కొంత బ్రిటిషు సేన ఉంచబడింది.

అటుతరవాత బ్రిటిషువారు ఒక నీచమైన పని చేశారు—లాహోరు దర్బారులో సర్దారుగా కొలువున్న గులాబ్‌సింగ్ అనే వాడికి కాశ్మీరును 10 లక్షల సవర్లకు అమ్మే టట్టు ఒక ఒప్పందం చేసుకున్నారు (16 మార్చిన, అమృతసర్‌లో). గులాబ్‌సింగ్ పైన ఒక పితూరీ లేచింది. దానికి కారకుడు లాల్‌సింగ్ అని బ్రిటిషువారు అతన్ని పదవి నుంచి తొలగించటమే గాక, పంజాబుపై తమ అధికారాలను మరింత బలపరచుకుంటూ



మరొక ఒడంబడికను లాహోరు ప్రభుత్వం మీద రుద్దారు.

సిక్కులు ఓడినా వారి పౌరుషమూ, స్వాతంత్ర్యేచ్ఛా చావలేదు. బ్రిటిషువారి ఆధిపత్యం వారికి దుస్సహమయింది. దీనికి తోడు, బ్రిటిషువారు రాణీ ఝిందాన్‌పై కుట్ర ఆరోపణ చేసి, ఆమెను లాహోరు నుంచి పంపి వెయ్యటంతో వారి ఆగ్రహం మరింత అయింది. యుద్ధానికి తత్తరపడే సిక్కులకు ఈ విధంగా అవకాశం చిక్కింది.

ముల్తాన్ పాలకుడైన దివాన్ ముల్రాజ్ శిస్తులు వసూలు చెయ్యలేక పోయాడు. లాహోరు ప్రభుత్వం అతనిపై చాలాపెద్ద

మొత్తం జరిమానా విధించింది. అతను ఆగ్రహించి, మార్చి 1848 లో తన పదవికి రాజీనామా ఇచ్చాడు. అతని పదవిని సర్దార్ ఖాన్‌సింగ్ అనేవాడి కిస్తూ, ఇద్దరు బ్రిటిషు సైనికాధికారులను లాహోరు ప్రభుత్వం పంపింది. ఈ ఇద్దరూ హత్య చేయబడ్డారు (ఏప్రిలు 20). ఈ పని ముల్రాజ్ చేయించినదే నన్నారు.

ఈ సాకు మీద బ్రిటిషువారు యుద్ధానికి రాక, ముల్రాజ్ సమస్యను లాహోరు ప్రభుత్వం ఎలా పరిష్కరిస్తుందో నని చూస్తూ ఊరుకున్నారు. అయితే ఒక చిన్న బ్రిటిషు ఉద్యోగి తొందరపాటు వల్ల పరిస్థితి విషమించింది. ముల్తానులో ముల్రాజ్ బలాలని ప్రతిఘటించమని, హజారా గవర్నరయిన ఛత్తర్‌సింగ్ తన కొడుకును సేనతో పంపితే, అతను (షేర్‌సింగ్) ముల్రాజ్ పక్షం కలిశాడు. ప్రముఖ సిక్కు నాయకులు షేర్‌సింగ్ పక్షమయారు. ఈ సారి సిక్కులు ఆఫ్ఘను లకు పెషావరు ఆశ చూపి, వారిని తమ పక్షం చేసుకున్నారు.

1848 అక్టోబరు 10 న బ్రిటిషువారు సిక్కులపై మరోసారి యుద్ధం ప్రకటించారు. నవంబరు 16 నా, 1849 జనవరి 13 నా ఉభయ పక్షాలకూ యుద్ధం జరిగింది. ఈ యుద్ధాలలో బ్రిటిషువారు ఓడక పోయినా తీవ్ర నష్టాలు పొందారు. జనవరి 22 న ముల్తానులో జరిగిన యుద్ధంలో వారు నెగ్గారు. ముల్రాజ్ దొరికిపోయి ద్వీపాంతరాలకు పంపబడ్డాడు.

అయితే, చీనాబ్ నదికి సమీపంలో గుజరాత్ అనే చోట ఇంగ్లీషువారు సిక్కుల పై ఘనవిజయం సాధించగలిగారు. దానితో సిక్కుల ప్రతిభ అడుగంటింది. బ్రిటిషువారు పంజాబును తమ అధీనం చేసుకున్నారు. దలీప్‌సింగ్ ఇంగ్లాండుకు పంపివేయబడ్డాడు. ఏటా అతనికి 5 లక్షల రూపాయల భరణం ఏర్పాటయింది.





# ఐరావతం

బ్రహ్మదేశంలోని ఒక నగరంలో గొప్ప ఖ్యాతి గల చాకలి ఒకడుండేవాడు. బట్టలు చలవ చెయ్యటంలో వాడికి గల ప్రజ్ఞ ఏమిటోగాని, వాడు చలవ చేసిన బట్టలు మల్లెపూల లాగుండేవి. ఇంకే చాకలికీ ఆ చాకచక్యం లేకపోయింది. అందుచేత నగరంలో ప్రతి ఒక్కరూ వాడికే బట్టలు వేసేవారు. అన్ని ఇళ్ళ బట్టలూ తాను ఒక్కడే చలవ చెయ్యలేడు గనక, ఆ చాకలి అనేకమంది చాకళ్ళను జీతానికి పెట్టుకుని పని చేయిస్తూ చాలా ఐశ్వర్యవంతుడయాడు.

ఈ చాకలి పొరుగున కుమ్మరి ఒకడుండేవాడు. చాకలి బట్టలు చలవ చెయ్యటంలో ఎంత సమర్థుడో, కుండలు చెయ్యటంలో ఈ కుమ్మరి అంత అసమర్థుడు. వాడికి కుదురైన మూకుడు చెయ్యటం కూడా చాత కాదు. అందుచేత వాడు పేదగానే ఉండిపోయాడు. వాడు తన కర్మ అనుకుని ఊరుకుంటే ఏ చిక్కూ లేకపోను. కాని ఈ కుమ్మరి అశక్తదుర్జనుడు. అందుచేత వాడు చాకలివాడి సిరి చూసి కళ్ళలో నిప్పులు పోసుకునేవాడు. తాను ఏ విధంగానూ పైకి రాలేడు గనక, చాకలిని ఎలా నాశనం చేద్దామా అని కుమ్మరి అస్తమానమూ ఆలోచిస్తూ ఉండేవాడు. ఆలోచించగా ఆలోచించగా వాడికొక అవకాశం దొరికింది. అది ఎలాగంటే—

ఆ నగరపు రాజుగారి దగ్గిర ఒక మంచి పట్టపుటేనుగు ఉండేది. అది అన్ని ఏనుగుల లాగే నల్లనిది. ఇంద్రుడి ఏనుగు ఐరావతం తెల్లగా ఉంటుందని ప్రతీతి. తన ఏనుగు కూడా తెల్లనిదైతే తన దగ్గిర కూడా ఒక ఐరావతం జాతి ఏనుగు ఉన్నదని లోకం మెచ్చుకుంటుంది గదా అని రాజుగారి తాపత్రయం. తన ఏనుగును ఎవరన్నా

యల్. రఘుపతిరావు



తెల్లగా చెయ్యగలిగితే మిగిలిన రాజులందరూ తనకు తీసికట్టవుతారని ఆయన ఆశ. రాజుగారికి గల ఈ కోరిక గురించి దేశంలో అందరికీ తెలిసిపోయింది.

ఒకనాడు కుమ్మరివాడు రాజభవనానికి వెళ్ళి, అక్కడి భటులతో, "నేను రాజుగారికి ఒక ముఖ్యవిషయం మనవి చేయవలసి ఉన్నది," అన్నాడు. అది రాజుగారి పట్టపుటేనుగు గురించి అని కూడా తెలిపాడు.

రాజుగారు వాడికి దర్శన మిచ్చాడు.

"క్షమించండి, మహారాజా. ఒక చిన్న మనవి. ప్రభువువారు పట్టపుటేనుగును తెల్లగా చేయించాలనుకుంటున్నట్టు విన్నాను," అన్నాడు కుమ్మరి.

"నిజమే. అలా చేయించాలనే నా ఉద్దేశం," అన్నాడు రాజు.

"మరి మన ఊరి పెద్ద చాకలి బొగ్గును కూడా తెల్లగా చెయ్యగలనని ప్రగల్భాలు పలుకుతాడు గదా! నిజంగా అంతవాడే కూడానూ. తమ పట్టపుటేనుగును చలవ చేసి తెల్లగా చెయ్యమంటే ఎలా ఉంటుందంటారు?" అన్నాడు కుమ్మరి.

"నీ ఆలోచన చాలా బాగుంది. పెద్ద చాకలివి వట్టి ప్రగల్భాలో, నిజమో తేల్చి పారేస్తాం," అన్నాడు రాజు.

వెంటనే ఆయన పెద్ద చాకలికి కబురు పెట్టాడు. చాకలి రాజభవనానికి వస్తూ, తన పొరుగున వుండే కుమ్మరి; రాజభవనం నుంచి వస్తూ ఉండటం చూసి, "రాజుగారికి చాకళ్ళతోనూ, కుమ్మర్లతోనూ ఏం పని పడిందబ్బా?" అనుకున్నాడు.

చాకలి వచ్చి తన ముందు సాష్టాంగపడినాక రాజుగారు, "చూడు, చాకలీ! నువు ఎంత నలుపునైనా తెల్లటి తెలుపుగా మార్చగలనని చెబుతూంటావని మాకు తెలియ వచ్చింది. మన పట్టపుటేనుగును తెల్లగా చేసే పని నీపైన పెడుతున్నాను.

తెల్లటి ఏనుగు కోసం ఎంత కాలంగానో కలవరిస్తున్నాను," అన్నాడు.

చాకలి ఈ మాటలు విని నిర్ఘాంత పోయాడు. తన పొరుగున ఉండే కుమ్మరి పెద్ద ఏడుపుగొట్టని చాకలికి తెలుసు. ఏను గును తెల్లగా మార్చే ఆలోచన రాజుగారికి తట్టి ఉండదనీ, కుమ్మరే ఆయన బుర్రలో ఈ ఆలోచన పెట్టి ఉంటాడనీ చాకలికి సులువుగా తెలిసిపోయింది.

అందుచేత చాకలి, "మహారాజా, తమ సెలవైతే ఏనుగును తెల్లగా తప్పక చేస్తాను. ఏముంది? దాన్ని బట్టలలాగే చలవ చెయ్యాలి. కాని నా దగ్గిర ఉన్న బానలేవీ తగినంత పెద్దవి కావు. అందుచేత తమరు ఏనుగు పట్టేపాటి బాన ఒకటి తయారు చేయించారంటే, ఆ ఏనుగును ఉప్పు చవుడులో చక్కగా ఉడకబెట్టి చలవ చేస్తాను," అన్నాడు.

మతిలేని రాజు చాకలి మాటలు నమ్మి, కుమ్మరిని పిలిపించి, "పట్టపుటేనుగు పట్టే పాటి చాకిబాన సాధ్యమైనంత త్వరలో తయారుచేసి ఇవ్వు!" అని ఆదేశించాడు.

ఈ సారి నిర్ఘాంత పోవటం కుమ్మరి వంతు. తాను చాకలి మెడకు వేద్దామను కున్న ఉచ్చు తన మెడకే తగులుకున్న



ట్టయింది. అయినా రాజుగారి ఆజ్ఞ పాలించక తప్పదు. "చిత్తం, అలాగే తయారు చేస్తాను," అని కుమ్మరి రాజుతో చెప్పి, ఇంటికి వచ్చి, సాటి కుమ్మర్లందరి సహాయం తోటీ ఒక పెద్ద బాన తయారుచేసి రాజ భవనానికి చేర్చాడు.

చాకలి వచ్చాడు. కుమ్మరి తయారు చేసిన బానలోకి రాజభటులు అతి ప్రయాస మీద ఏనుగును ఎక్కించారు. కాని ఏనుగు బానలో కాలు పెట్టగానే అది కాస్తా ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది.

రాజు కుమ్మరిని పిలిచి, "బాన మరీ పలచగా చేశావు. అది ఏనుగును భరించ

లేక పోయింది. ఈ సారి చాలా మందంగా తయారుచేసి తీసుకురా!" అని తిరిగి ఆజ్ఞాపించాడు.

కుమ్మరికి మతిపోయింది. కాని రాజాజ్ఞ పాలించక తప్పదు. ఊళ్ళో కుమ్మరులందరూ చేరి చాలా మట్టితెచ్చి, దానితో చాలా లావైన బాన తయారుచేసి, దాన్ని అతి కష్టం మీద కాల్చి, రాజభవనానికి చేరవేశారు.

ఈ సారి బాన ఏనుగు బరువుకు తట్టుకున్నది. కాని అందులో నీరుపోసి, దాని కింద కట్టెల మంట పెట్టి కాస్తే, నీరు ఎంతకూ వేడెక్కలేదు. ఎన్ని బళ్ళ కట్టెలు కాల్చినా ప్రయోజనం లేకపోయింది.

"మహారాజా, ఈ సారి బాన మరీ లావయింది. ఇందులో నీరు మరిగించటం ఎవరి తరమూ కాదు," అన్నాడు చాకలి.

రాజుగారు కుమ్మరిని పిలిచి, "బాన ఇంత మందంగా ఎందుకు చేశావు? అందులో నీరు వేడెక్కటం లేదు. ఈ సారి సరిగా ఉండే బాన తీసుకు రా, తెలిసిందా?" అని చివాట్లు పెట్టాడు.

కుమ్మరీ, వాడి బంధువులూ కలిసి ఎన్నో బానలు తయారు చేశారు, ఎంతో శ్రమ పడ్డారు, మాసాల తరబడి తమ పనులన్నీ పాడు చేసుకున్నారు. చిట్ట చివరకు మంద బుద్ధి అయిన కుమ్మరికి నిజం తెలిసి వచ్చింది: ఏనుగును మోసే బలమూ, నీరు మరిగించేటంత పలచనా గల బాన తయారు చెయ్యటం, తమ వల్ల కాదుగదా, బ్రహ్మ దేవుడి వల్ల కూడా కాదు.

కుమ్మరి ఈ మాటే చివరకు రాజుగారితో చెప్పాడు.

రాజుగారు ఏనుగును చలవ చేయించే ప్రయత్నం విరమించు కున్నాడు. కాని కుమ్మరులు ఈ వ్యర్థప్రయత్నంలో చాలా నష్టపోయారు. వారి శ్రమకు ఫలితం ఏమీ దక్కలేదు.





# శిథిలాలయం

## 11

[అరణ్యంలో ఎలుగుబంటును చంపింతరవాత, శిఖిముఖీ, నాగుమల్లులకు కనిపించిన వింతమనిషి, తన పేరు నవరభేరుండం అని చెప్పి, వాళ్ళిద్దర్నీ వెంట బెట్టుకుని పూజారి పద్దకు బయలుదేరాడు. వాళ్ళు కొండ ఎక్కుతూండగా, విక్రమకేసరి వాళ్ళ కేసి పరిగెత్తుకు వస్తూ; తనకు పూజారి దాగివున్న కొండగుహ తెలిసిందని కేకవేశాడు. తరవాత—]

విక్రమకేసరి వేగంగా తమ కేసి పరిగెత్తుకు రావటం చూస్తూనే, శిఖిముఖికి తాను శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు వేసిన పథకం దెబ్బతిని పోయిందని అర్థమైంది. ఇప్పుడు విక్రమకేసరి పెట్టిన కేకలు ఆ దుర్మార్గుడు వినే వుంటాడు; సందేహం లేదు. తననూ, నాగుమల్లినీ కల్లబొల్లి మాటలతో మోసపుచ్చి వెంట తీసుకుపోవచ్చుని భావించిన పూజారికి, విక్రమకేసరి రాకతో ఆ ఎత్తు పారదని తెలిసిపోయి వుంటుంది. ఇప్పుడు చేయువలసిందేమిటి? పూజారి బంటయిన సవరభేరుండాన్ని బంధిస్తే, పూజారి అతడికి సాయపడేందుకు రావచ్చు. అప్పుడు....

శిఖిముఖి యిలా ఆలోచించి విక్రమకేసరి కేసి చేయి వూపుతూ, నాగుమల్లితో, "మల్లీ! అనుగో, ఆ భేరుండాన్ని మంచి మాటలతో పారిపోకుండా చూడు. నేను,




కేసరితో ఒక మాట చెప్పి యిప్పుడే వస్తాను," అన్నాడు.

నాగుమల్లి సరే నన్నట్టు తల వూపి, ముందుపోతున్న భేరుండం కేసి గబగబా పరిగెత్తింది. ఇంతలో కొండ మీది నుంచి శిథిలాలయు పూజారి పెద్ద గొంతుతో, "భేరుండం! నువ్వు పరాకు చిత్తగిస్తున్నట్టున్నది. జాగ్రత్త. ఇదుగో కర్మపాశం! దాన్ని పట్టుకుని వెంటనే ఆకాశంలోకి ఎగురు," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటలు వింటూనే, భేరుండం కేసి తిరిగి అతణ్ణి పట్టుకునేందుకు పరిగెత్తేంతలో, కొండ పై నుంచి



నల్లని తాడొకటి విసురుగా వచ్చి భేరుండం ముందు పడింది. భేరుండం దాన్ని గబగబా నడుముకు చుట్టుకుని, "పూజారిదేవా! ఈ నవరభేరుండం ఆకాశంలోకి ఎగిరి పోటానికి సిద్ధంగా వున్నాడు. ఏమిటి, మీ ఆజ్ఞ?" అని కేక పెట్టాడు.

మరుక్షణంలో భేరుండం తాడు సాయంతో గాలిలోకి లే అతణ్ణి పట్టుకునేందుకు శిఖిముఖీ, నాగుమల్లులతోపాటు విక్రమకేసరి కూడా పరిగెత్తాడు. కాని, భేరుండం అప్పటికే గాలిలో అయిదారు నిలువుల ఎత్తుకు లేచిపోయాడు. విక్రమకేసరి పళ్లు కొరుకుతూ, "ఓరి, పూజారిబంటూ! నీకు చావు తప్పదు!" అని విల్లంబు పైకెత్తి, బాణం వదలబోయాడు.

శిఖిముఖి చప్పున ఏదో ఆలోచన వచ్చిన వాడిలా తల ఎగర వేసి, విక్రమకేసరి చేయి పట్టుకుని అతడు బాణం వదలకుండా ఆపి, "కేసరీ, తొందరపడకు. ఆ బంటును చంపినందువల్ల మనకు కలగబోయే మేలు కన్న కీడే అధికంగా వుంటుంది," అన్నాడు.

"వాడు దుష్టుడి సేవకుడు; దుష్టుడు!" అన్నాడు విక్రమకేసరి కోపంగా.

"వాడు దుష్టుడి సేవకుడే గాని, దుష్టుడు మాత్రం కాదు. కేవలం అల్పజీవి, ఒట్టి





బోళామనిషి. తాగిన మైకంలో వాడు నిజంగా తాను ఆకాశంలోకి ఎగరగల ననుకుంటు న్నాడు. అలాంటి మందమతిని ఎవరైనా తమ స్వప్రయోజనానికి ఉపయోగించుకో వచ్చు. వాడు బతికి వుండి, పూజారి సేవ లోనే వుంటే ముందు ముందు మనకు పనికి వస్తాడు," అన్నాడు శిఖిముఖి.

"ముందు ఏ నాటి సంగతో ఎందుకు? ఆ పూజారి వున్న గుహను ఒక కంట కని పెట్టి వుండేందుకు ఇద్దరు శబరుల్ని కావలి వుంచాను. మరొకడు చెట్ల మీదుగా ఎగిరి పోతున్న ఎలుగుబంటి రహస్యం ఏమిటో కనుక్కొనేందుకు వెళ్ళాడు. మనం పూజారి వున్న గుహను చుట్టు ముట్టుదాం," అన్నాడు విక్రమకేసరి.

"నీ కేకల్తో, గండభేరుండం తప్పిం చుకు పోవటంతో ఆ పూజారిగాడు మన ప్రయత్నం ఏమిటో గ్రహించే వుంటాడు," అని శిఖిముఖి తానూ, నాగుమల్లీ అరణ్యంలో ప్రవేశించి-ఎలుగ్గొడ్డును చంపి నప్పటి నుంచీ జరిగిన సంఘటనలన్నీ చెప్పి, గండభేరుండం తన కిచ్చిన జింక చర్మాన్ని అతడికి చూపించాడు. దాని మీద చిత్రించబడిన దృశ్యాలు చూసి విక్రమ కేసరి సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయాడు.



"ఈ చర్మం మీది చిత్రాలు మనకు బ్రహ్మపుత్రా లోయల్లో ప్రవేసించినప్పుడు మార్గాన్వేషణలో సహాయపడతవి. దాన్ని నీ దగ్గిరే వుంచు," అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఆ జింకచర్మాన్ని ఎప్పటిలా గుండ్రంగా చుట్టి, తాడుతో నడుముకు బిగించుకున్నాడు. అంతలో శబరు డొకడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "కేసరి దొరా! ఆ మంత్రాల మారిగాడూ, మరొ కడూ గుహలో చేరి ఏదో మాట్లాడుకుంటు న్నారు. లోపల వాళ్ళు వెలుగు కోసం మంట చేసినట్టున్నది. గుహ ద్వారం పొగతో మూసుకు పోయింది," అని చెప్పాడు.





పూజారి వున్న గుహ చూసిన వాడు కావటం చేత, దారికోసం వెతుక్కోవలసిన అవసరం లేకుండా పోయింది.

కొద్దిసేపటి తరవాత వాళ్ళు గుహను సమీపించేసరికి, గుహ ముఖాన్ని దట్టంగా పొగ కమ్మి వుండటం వాళ్ళ కంటబడింది. ఆ పొగ చూస్తూనే శిఖిముఖి, "ఆ దుష్టుడు లోపల లేడు. అంత పొగలో ఏ ప్రాణీ అట్టే కాలం బతకదు," అన్నాడు.

"అయితే వాడు తప్పించుకు పోయి నట్టేనా?" అన్నాడు విక్రమకేసరి నిరుత్సాహపడిపోతూ.

శిఖిముఖి జవాబిచ్చేంతలో, వాళ్ళ వెంట వున్న శబరుడు ఒక ఎత్తయిన కొండరాతి మీద నిలబడి, "దొరా! పొగ యిక్కణ్ణుంచే కాదు, గుహ వెనక మరి రెండు మూడు చోట్ల నించి కూడా వస్తున్నది," అని పెద్ద కేకపెట్టాడు.

"అంటే, ఆ దుర్మార్గుడు పారిపోయేందుకు గుహలో మరికొన్ని రహస్య మార్గాలున్నవన్నమాట. కేసరిదొర కావిలి పెట్టిన ఇద్దరు శబరవాళ్ళూ ఏం చేస్తున్నారు? నిద్రపోతున్నారా లేకపోతే వాళ్ళను కూడా పూజారి భుజానేసుకు పోయాడా?" అన్నది నాగుమల్లి అవహేళన చేస్తున్నట్టు.

"గుహలో వాళ్ళు మంట చేసింది వెలుగు కోసం కాదు, మన కళ్ళల్లో ఇంత పొగా, దుమ్మూ కొట్టి అక్కణ్ణించి పారిపోయేందుకు. నాకు వాడు దొరుకుతాడన్న నమ్మకం లేదు. అయినా ప్రయత్నం చేసి చూద్దామంటావా, కేసరీ?" అన్నాడు శిఖిముఖి.

"దొరక్క మాయమైపోతాడా? వాడేమన్నా ఆకాశభూతమా?" అన్నది నాగుమల్లి విసురుగా.

"నాగుమల్లి బాగా చెప్పింది, శిఖీ! ఇక బయల్దేరుదాం," అంటూ విక్రమకేసరి ముందుండి దారి తీశాడు. అతడు లోగడే





అది గుర్తించిన శిఖిముఖి వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, "ఆ దెయ్యాలపోతు శబరుల్నే కాదు, సవరవాళ్ళను కూడా గాడిదల్ని చేశాడు. ఇప్పుడు మనం కాస్త తెలివిగా ప్రవర్తించాలి. కేసరీ, నువ్వు కావలి పెట్టిన వాళ్ళిద్దరూ ఆ పూజారిని అనుసరించి పోయారని నా అనుమానం," అని అక్కడున్న చెట్టు కొమ్మ ఒకటి విరిచి గుహ ముందుకు వెళ్ళి, దానితో గుహ ద్వారం ముందు గట్టిగా విసిరాడు. గాలికి పొగ కాస్తా చెల్లా చెదరైంది. అంతలో విక్రమకేసరి గుహ లోపలికి రెండు మూడు బాణాలు కొట్టాడు. లోపలి నుంచి ఎలాంటి శబ్దమూ రాలేదు.

ఇప్పుడేమి చేయుటమా అని శిఖిముఖి ఆలోచించేంతలో, గుహ మీది నుంచి నాగుమల్లి పెద్దగా చప్పట్లు చరిచి ఒక పెద్ద కేక పెట్టింది. ఆమెకు గుహ వెనక దిగువగా వున్న లోయ కేసి పోతున్న పూజారీ, సవర భేరుండం కనిపించారు. వాళ్ళకు కొంచెం వెనక రాళ్ళచాటున నక్కుతూ యిద్దరు వ్యక్తులు పోతున్నారు. వాళ్ళు విక్రమకేసరి చెప్పే శబర కావలి వాళ్ళని ఆమె అనుకున్నది. ఆమె కేక పెట్టి పిలవగానే వాళ్ళల్లో ఒకడు వెనక్కు తిరిగి చూసి, రెండో




వాడితో ఏమో చెప్పి గబగబా కొండ ఎక్కి గుహ కేసి రాసాగాడు.

నాగుమల్లి తాను పూజారిని చూసిన సంగతి శిఖిముఖి వాళ్ళకు చెప్పబోయేంతలో, అతడూ, విక్రమకేసరీ, వెంట వున్న శబరుడూ గుహ మీదికి వచ్చి, దిగువనున్న లోయ కేసి చూశారు. వారికి తమ దగ్గిర కొస్తున్న శబరుడితో పాటు, లోయలోకి దిగిపోతున్న శిథిలాలయ పూజారి కూడా కనిపించాడు.

"శిఖీ! మనం ఆ పూజారిగాణ్ణి వెంట తగిలి పట్టుకోవటం ఏమంత కష్టం కాదు," అన్నాడు విక్రమకేసరి ఎంతో ఉత్సాహంగా.





"నాకూ అలాగే అనిపిస్తున్నది. మల్లి ఏమంటుందో ?" అంటూ శిఖిముఖి నాగుమల్లి కేసి చూశాడు.

"వాడు అందకపోతే బాణం కొట్టి చంపుతాం. ఒకవేళ అంది కూడా తిరగబడితే యీటెతో పొడిచి ప్రాణాలు తీస్తాం. ఊఁ పదండి," అంటూ నాగుమల్లి గుహ మీది నుంచి కిందికి దూకింది.

నాగుమల్లి ధైర్యసాహసాలు లోగడే రుజువు అయివుండకపోతే, శిఖిముఖీ, విక్రమకేసరి కూడా ఈ మాటల్ని కేవలం వాచాలతగానో, బడాయి చూపటంగానో జమకట్టి వుండేవాళ్ళు. కాని, వాళ్ళిద్దరికీ ఆమె శక్తిసామర్థ్యాలు తెలుసు. అయినా, ఆమె రక్షణబాధ్యత తమ మీద వున్నదని నమ్మివున్న ఆ ఇద్దరూ కూడబలుక్కుని, నాగుమల్లికి అటూ యిటూ తాముండి, ఆమెకు ఎలాటి ప్రమాదం జరక్కుండా చూడాలనుకున్నారు. శిథిలాలయ పూజారి ఏ క్షణంలో ఏ రకమైన దుష్టపన్నాగం పన్నబోతాడో అన్నది ఎవరికీ అంతు చిక్కని సంగతి....

శిఖిముఖి ముందుండి దారితీస్తుండగా తతిమ్మా ముగ్గురూ అతణ్ణి అనుసరించి వేగంగా లోయలోకి దిగసాగారు. వాళ్ళ దృష్టి శిథిలాలయ పూజారి మీదనే వున్నది. వాడు తమ కనుగప్పి, ఏ రాళ్ళచాటు నుంచో పారిపోకుండా చూడాలని వాళ్ళనుకున్నారు. కాని పూజారి నిర్భయంగా, తాపీగా లోయలోకి దిగిపోతున్నాడు. అతడు ఒకటి రెండు సార్లు తలతిప్పి శిఖిముఖీ వాళ్ళ కేసి చూసి, భేరుండంతో చేతులూపుతూ ఏదో చెప్పాడు.

"ఆ దుష్టుడి ప్రవర్తన చూస్తూంటే నా కేదో అనుమానంగా వున్నది, కేసరీ. వాడు మన నుంచి పారిపోయేందుకు ఎలాంటి ప్రయత్నమూ చేయకపోగా, మనను ముక్కుకు తాడుపోసి లోయలోకి

లాగుతున్నట్టు ప్రవర్తిస్తున్నాడు," అన్నాడు శిఖిముఖి.

"లోయలో వాడి బ్రహ్మరాక్షసి సేన కాపలా వుందేమో!" అన్నది నాగుమల్లి వెటకారంగా.

"ఉంటే... నవరగండుపోతు కూతురు వాళ్ళను ఏకాకిగా ఎదుర్కొని జయించేస్తుంది! మన కెలాంటి భయమూ లేదు కేసరీ," అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలకు విక్రమకేసరి పెద్దగా నవ్వాడు. అంతలో శబర కావలి వాళ్ళల్లో రెండవవాడు వాళ్ళ దగ్గరకు పరిగెత్తుకు వచ్చి, పూజారి గుహలో వున్న మరొక దారి కుండా ఎలా బయటపడిందీ, తాను వాణ్ణి దృష్టి నుంచి తప్పుకు పోనీయకుండా లోయలోకి ఎలా వెన్నంటి పోయిందీ— శిఖిముఖీ వాళ్ళకు చెప్పాడు.

"నీ దగ్గిర వడిశెల వుంది కదా? ఇప్పట్లో నీ యీటె కన్న దాని ఉపయోగం ఎక్కువలా కనబడుతున్నది. చేతికి అందక పోతే ఆ పూజారిగాణ్ణి ఒక్క వడిశెల దెబ్బతో కింద పడగొట్టాలి," అన్నాడు విక్రమకేసరి, ఆ శబరుడితో.

శబరుడు ఈటెను భుజాన పెట్టుకుని, వడిశెలలో రాయిపెట్టి దాన్ని అటూ యిటూ ఊపుతూ నడవసాగాడు. అంతలో పూజారి కొండ దిగి ఎదురుగా వున్న మైదాన ప్రదేశంలో ప్రవేశించాడు. శిఖిముఖి వెంట వున్న వాళ్ళను వేగంగా కదలండని హెచ్చరించి, పరిగెత్తుకుంటూ పోయి కొండ దిగి మైదానం చేరుతూనే, "ఓహోయ్, దొంగ పూజారీ, ఆగు! పారిపోవాలని ప్రయత్నిస్తే చావు తప్పదు," అని కేక పెట్టాడు.

శిథిలాలయ పూజారి వెనక్కు తిరిగి, "అదుగో, ఆ అర్ధచంద్రాకారంగా కనబడే గండశిలలున్న వే, అక్కడికి పోయి ఆగుతాను. తాపీగా రండి, అంతా మాట్టాడుకుందాం," అన్నాడు. —(ఇంకా వుంది)






# దారుణహత్య

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువ్వు పడుతున్న ఈ శ్రమ అశుభమైనదిగా భావించకు. ఎందుచేతనంటే ఒక్కొక్కసారి అశుభం ద్వారానే శుభఫలితాలు సంప్రాప్త మవుతాయి. అందుకు నిదర్శనంగా నీకు కల్యాణి అనే వైశ్యకన్య కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం కాంచీపురంలో కల్యాణి అనే వైశ్యకన్య, జగదేకసుందరి ఉండేది. ఆమెను వివాహమాడటానికి ఎంతెంత గొప్ప వాళ్ళో ముందుకు వచ్చారు. అయితే ఆమె వివాహం జరగలేదు. ఒక కారణం, ఆమె తండ్రి తీవ్రమైన వ్యాధితో చాలా కాలం తీసుకుని, చివరకు మరణించాడు. మరొక

## బేతాళ కథలు




కారణం ఏమంటే, కల్యాణి అమరగుప్తు డనే వైశ్య యువకుణ్ణి కొంతకాలంగా ప్రేమించింది. ఆ యువకుడు కూడా ఆమెను ప్రేమించి, తగిన సమయం దొరక గానే తన తండ్రి అనుమతితో పెళ్ళాడాలనే ఉద్దేశంతో ఉన్నాడు.

తండ్రి పోయాక కల్యాణికి ఆమె మేన మామ ప్రచండగుప్తుడు రక్షకుడైనాడు. ఈ ప్రచండగుప్తుడు జూదరీ, తాగుబోతూనూ. కల్యాణికి రక్షకుడైనది మొదలు అతను ఆమె తండ్రి ధనాన్ని మంచినీరులాగా ఖర్చు చెయ్యసాగాడు. అది కూడా త్వర లోనే పూర్తి అయేటట్టు కనబడింది.

ఈ సమయంలో ప్రచండగుప్తుడికి ఒక మంచి విషయం తెలిసింది. ఏదేమిటంటే, కల్యాణిని ప్రేమించే అమరగుప్తుడి తండ్రి కోటీశ్వరుడు. తన మేనగోడలు అలాటివాడికి కోడలైతే, ఆమె ద్వారా తాను ఎంత డబ్బ యినా రాబట్టవచ్చు.

"నువు నిశ్చింతగా ఉండు. నీకూ, ఆ అమరగుప్తుడికీ పెళ్ళి జరిగే ఏర్పాటు నేను చూస్తాను. నీ సుఖం నేను చూడక పోతే మరెవరు చూస్తారు?" అని ప్రచండ గుప్తుడు, అమరగుప్తుడి తండ్రి అయిన వీరేంద్రగుప్తుడి వద్దకు వెళ్ళి, "నా మేన గోడలు కల్యాణి అసాధారణ సౌందర్యవతి అన్న సంగతి మీకు తెలిసే ఉంటుంది. ఆమె ఎందరో రాజకుమారులను సైతం నిరాకరించి, మీ కుమారుడైన అమరగుప్తుణ్ణి తప్ప మరొకరిని పెళ్ళాడనని భీష్మించుకు కూర్చున్నది. మీ కుమారుడు కూడా కల్యాణిని పెళ్ళాడాలన్న ఉద్దేశంతో ఉన్నట్టు విన్నాను. అందుచేత మీరు సరేనంటే ఆ ఇద్దరికీ పెళ్ళి చేసి, వారిద్దరి జీవితాలూ సుఖమయ మయేటట్టు చేద్దాం," అన్నాడు.

"మీ మేనగోడలిని నేను ఎలాటి పరి స్థితిలోనూ నా కోడలుగా చేసుకోను. మీరు నన్ను ఇంతదూరం అడగనవసరంలేదు,"

అన్నాడు వీరేంద్రగుప్తుడు. అతను అసలే లోభి. కల్యాణి కిప్పుడేమీలేదు. అలాటి కోడల్ని తెచ్చుకోవటం అతనికి ఎంత మాత్రమూ ఇష్టంలేదు. దానికి తోడు ప్రచండగుప్తుడంటే అతనికి చాలా ద్వేషం. నిజానికి ప్రచండగుప్తుడు ద్వేషించదగిన వాడే కూడానూ.

వీరేంద్రగుప్తుడు కల్యాణిని తన కోడలుగా నిరాకరించటంతో ప్రచండగుప్తుడి పథకమంతా పాడైపోయింది. కల్యాణి ప్రేమ భగ్నంకావటం మాట ఏమైనా, తన భవిష్యత్తు భగ్నమైపోయినందుకు ప్రచండగుప్తుడు చాలా చింతించాడు.

అతను స్వతహాగా దుర్బుద్ధి కావటంచేత అతని కొక దురాలోచన కలిగింది. కల్యాణిని వీరేంద్రగుప్తుడు తన కోడలుగా స్వీకరించేటట్టు చెయ్యటానికి అతను మరొక పథకం ఆలోచించాడు. ఈ పథకం కొనసాగాలంటే కల్యాణి తోడ్పాటు తనకు అవసరం. అందుచేత ప్రచండుడు కల్యాణితో రహస్యంగా ఇలా అన్నాడు:

"చూడు, కల్యాణీ! ఆ వీరేంద్రగుప్తుడు నిన్ను తన కొడుక్కు చేసుకోననేసి, నీ ఆశలన్నీ నీటగలిపేశాడు. అందుకు నువ్వెంత బాధపడుతున్నావో, అంతకు పదింతలు నేను బాధపడుతున్నాను. నీ సుఖం నేను





కాకపోతే మరెవరు చూస్తారు, చెప్పు! ప్రపంచం తలకిందులైనా సరే, నీకూ నీ అమరగుప్తుడికీ పెళ్ళి చేసితీరుతాను. అందు కొక ఉపాయం ఉన్నది. అందులో నీ సహకారం కూడా కొంత కావాలి."

"ఏమిటది?" అని కల్యాణి అడిగింది.

"నువు ఇవాళ వీరేంద్రగుప్తుడి వద్దకు వెళ్ళి, ఈ రాత్రి నేను అతన్ని హత్యచేసే ఉద్దేశంతో ఉన్నానని చెప్పు. అతను మామూలుగా పడుకునే మంచంమీద మనిషి ఉన్నట్టు కనపడేటట్టుగా దిళ్ళూ అవీ అమర్చమని సలహా ఇయ్యి. నేను ఒక రాత్రివేళ అతని ఇంట్లో ప్రవేశించి, అతని మంచంమీద దిళ్ళను పొడుస్తాను. వీరేంద్ర గుప్తుడు తగిన జాగ్రత్తమీదనే ఉంటాడు గనక నన్ను పట్టుకుంటాడు. నేను కూడా తేలికగా దొరికిపోయి, పశ్చాత్తాపం నటిస్తాను. నువు వచ్చి నా ప్రాణం కాపాడమని వీరేంద్రుణ్ణి వేడుకో. నువు తన ప్రాణం కాపాడావుకదా అన్న కృతజ్ఞతా భావంతో అతను నన్ను విడిచిపుచ్చుతాడు. నీ సుఖం కోరే నేనీ పని చేశానని చెప్పినాక అతనికి నీమీద మరింత అభిమానం కలిగి, నిన్ను తన కోడలుగా చేసుకుంటాడు. ఒకవేళ నాకు శిక్షపడినా కొద్ది శిక్ష పడుతుంది. నీకోసం నేనా శిక్ష భరించగలను." అన్నాడు ప్రచండగుప్తుడు.

"అంతా నీ యిష్టం, మామయ్యా!" అన్నది కల్యాణి.

ఆ రోజు కల్యాణి ఇంటి నుంచి బయలుదేరి వెళ్ళిందిగాని, వీరేంద్రగుప్తుడి ఇంటి చాయలకు కూడా పోలేదు. ఆమె ప్రచండుడి పథకంలో తన పాత్రను తాను నిర్వహించలేదు.

ఆ రాత్రి ప్రచండుడు వీరేంద్రుడి శయనాగారం ప్రవేశించి, మంచంలో పడుకుని ఉన్న వీరేంద్రుడి రొమ్ములో కత్తిదించి, వీరేంద్రుడు పెట్టిన చావుకేకకు కొయ్యబారి

పోయాడు. ఆ స్థితిలో అతన్ని వీరేంద్రుడి నౌకర్లు పట్టుకున్నారు.

తరవాత రాజుగారు ప్రచండుణ్ణి విచారణ చేసి, హత్యానేరానికి అతనికి మరణదండన విధించాడు. విచారణ సమయంలో ప్రచండుడు తాను తన మేనకోడలితో చెప్పిన ఆలోచన బయటపెట్టలేదు. దాన్ని ఎవరూ నమ్మరని అతనికి తెలుసు.

తరవాత కల్యాణికీ అమరగుప్తుడికీ వివాహం జరిగింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. కల్యాణి వీరేంద్రగుప్తుణ్ణి ఎందుకు హెచ్చరించలేదు? వీరేంద్రుడి చావుకు ఆమె కారకురాలు కాలేదా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రచండుడు వేసిన పథకం దుష్టమైనది కాకపోలేదు. అటువంటి పద్ధతిలో ఆమె తాను ప్రేమించిన వాణ్ణి పెళ్ళాడగోరినట్టయితే, ఆమె అమరగుప్తుడితో కలిసి ఎన్ని రకాల పథకాలైనా వేసిఉండును. అదీకాక, ప్రచండుడి పథకం ద్వారా వీరేంద్రుడి మనసు మారుతుందన్నది ప్రచండుడి భ్రమ. వీరేంద్రుడు లోభి, ప్రచండుణ్ణి ద్వేషిస్తున్నవాడు. అతనికి కల్యాణి పట్ల ఎలాటి దురభిప్రాయమూ లేదు. ప్రచండుడి పథకం పారినంత మాత్రాన అతనికి గల అభ్యంతరాలేవీ తొలగవు. పైపెచ్చు ప్రచండుడి పట్ల ద్వేషం మరింత అవుతుంది. అందుచేత ఆమె ఆ పథకంలో పాల్గొనలేదు. అందువల్ల ఆమెకు పూర్తిగా లాభం కలిగింది. తనద్వారా డబ్బు సంపాదించుదామని చూసిన మేనమామా, తనను కోడలుగా చేసుకోనని శపథం చేసిన మామా కూడా తొలగిపోయారు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# విదూషకి

ఒక రాజుకు ముగ్గురు చక్కని కూతుళ్ళు ఉండేవాళ్ళు. వాళ్ళు తల్లిలేని పిల్లలు. అందుచేత రాజే వాళ్ల కష్టసుఖాలు చూస్తూ వచ్చాడు. ఇలా ఉండగా ఒకనాడు రాజుగారు తన శత్రువులతో యుద్ధానికి వెళ్ళవలిసి వచ్చింది. అందుచేత దగ్గిరలో ఉన్న ఒక స్త్రీని పిలిచి, తాను యుద్ధం నుంచి తిరిగి వచ్చేదాకా తన కుమార్తెలకు సంతోషంగా ఉండేటట్టు చూడమన్నాడు. ఆ స్త్రీ హాస్యగత్తె.

రాజుగారు యుద్ధానికి తరలి వెళ్ళగానే హాస్యగత్తె రాజభవనంలో మకాం పెట్టింది. ఆమె రాజకుమార్తెలకు నవ్వు వచ్చే కథలు చెప్పి, వినోదమైన పాటలు పాడి, చక్కని కాలక్షేపం కలిగించింది.

అయితే చిక్కేం వచ్చిందంటే, హాస్యగత్తెను రంజింప జెయ్యటం రాజకుమార్తెల వల్ల కాలేదు. ఆమెకు రాజభవనం ఖైదులాగున్నది. ఆమెకు ఎటన్నా పారిపోవాలని పించింది.

అందుచేత ఒకనాడు హాస్యగత్తె అలా రాజోద్యానంలో తిరిగి వద్దామని వెళ్ళి ఎంతకూ తిరిగి రాలేదు. రాజకుమార్తెలు భోజనం చెయ్యకుండా ఆమె కోసం చూస్తూ కూర్చున్నారు. చేసిన వంటకాలన్నీ పూర్తిగా చల్లారి పోయాయి.

చాలాసేపటికి ఆమె తిరిగి వచ్చింది.

"ఇంతసేపు ఎక్కడికి పోయావు, దొడ్డమ్మా? నీ కోసం చూస్తూ భోజనం చెయ్యకుండా కూర్చున్నాం గద!" అన్నారు రాజకుమార్తెలు.

"లోపలే కూచుంటే నాకు ఊపి రాడటం లేదమ్రా. కాస్త గాలి పోసుకుని వద్దామని వెళ్ళాను. నా కోసం మీరు ఎదురు చూడకండి. నేను గుబులు పుట్టినప్పుడల్లా అలా బయటికి వెళ్లి, అది మళ్లినప్పుడు తిరిగి

వచ్చి, ఏముంటే అది తినేస్తాను," అన్నది హాస్యగత్తె.

అది మొదలు ఆమె ప్రతి సాయంకాలమూ తోటలోకి వెళ్ళి, తన కిష్టమైనప్పుడు తిరిగి వచ్చేది. అలా తిరిగి వచ్చినాక ఆమె మరింత సరదా అయిన కబుర్లు చెప్పి, రాజకుమార్తెలను కడుపుబ్బేలాగ నవ్వించేది. అందుచేత ఆమె షికార్లకు వాళ్ళు అభ్యంతరం చెప్పేవారు కారు.

ఒక రోజు తెల్లవారగట్ల నిద్ర లేస్తూనే హాస్యగత్తె, "రోజూ తోటలోకి పోతున్నాను, కాని దాన్ని ఏ రోజూ ఆసాంతం చూడనే లేదు. ఈ పూట వెళ్ళి, చూడని వింతలు ఏమేమి ఉన్నాయో తెలుసుకోవాలి," అనుకున్నది.

అలా అనుకుని ఆమె ఆ ఉద్యానం చివర దాకా నడుచుకుంటూ వెళ్ళింది. ఆ చివరలో ఒక రాతిపలక మీద ఆమె పాదం పడగానే అది కదిలినట్టు కనబడింది. దాన్ని ఎత్తి చూస్తే అడుగున మెట్లున్నాయి.

"ఇదేదో వింతగా ఉందే!" అనుకుని ఆమె ఆ మెట్లు దిగి వెళ్ళింది. మెట్లవరస అయి పోయాక ఆమె కెదురుగా మరో రాజ భవనం కనబడింది. ఆమె భవనద్వారం సమీపించి, "ఎవర్రా లోపల?" అని కేక



పెట్టింది. సమాధానం రాలేదు. ఆమె తలుపు తోసుకుని లోపలికి వెళ్ళింది. పాకశాలలో ఆమె ఈడువాడే ఒకడు వంటచేస్తున్నాడు.

"ఏం, పెద్దయ్యా?" అని హాస్యగత్తె అతన్ని పలకరించింది.

"ఇక్కడి కెలా వచ్చావు?" అని వంటవాడడిగాడు.

"నా కర్మ ఈడ్చుకొచ్చిందిలే. కాని ఈ వంటంతా ఎవరి కోసం చేస్తున్నట్టు?" అని హాస్యగత్తె అడిగింది.

"ముగ్గురు రాజకుమారులు. నా యజమానులు. మహా చక్కని వాళ్ళు," అన్నాడు వంటవాడు.



"ఓహెూ! వాళ్ళేరీ?" అని హాస్యగత్తె అడిగింది.

"వేటకు వెళ్ళారు."

"అలాగా? అయితే నా కింత తిండి పడేద్దూ! ఆకలి దహిస్తున్నది," అన్నది హాస్యగత్తె.

వంట వాడామెకు భోజనం పెట్టాడు. భోజనమయాక హాస్యగత్తె, "కాస్తంత తేనె ఉంటే పెడుదూ!" అన్నది.

"నిలువు జాడీ అడుగున కొంచెం ఉండాలి. చూస్తాను," అంటూ వంటవాడు సామాన్ల గదిలోకి వెళ్లి, అయిదడుగుల ఎత్తుండే జాడీలోకి వంగి, దాని అడుగును గరిటెతో తడమసాగాడు. హాస్యగత్తె వాడి వెనకే వెళ్ళి, వాణ్ణి ఆ జాడీలోకి తల్ల కిందులుగా తోసేసి, పెద్ద పెట్టున నవ్వు కుంటూ రాజకుమార్తెల వద్దకు వచ్చిన దారినే తిరిగి పోయింది. తరవాత ఆమె వాళ్ళతో జరిగినదంతా చెప్పి, వాళ్ళను కడుపు చెక్కలయేట్టు నవ్వించింది.

సాయంకాల మయేసరికి రాజకుమారులు వేట నుంచి తిరిగి వచ్చారు. వాళ్ళకు ఆకలి దహించేస్తున్నది. వాళ్ళు వంటవాడి కోసం అంతటా గాలించి, చివరకు నిలువు జాడీలో తల కిందులుగా ఉండటం చూశారు.

"ఈ జాడీలో ఎలా పడ్డావురా?" అని వాళ్ళు అడిగారు, వాణ్ణి పైకి లాగి.

"ఎలా పడ్డానంటే, తేనె కోసం వంగి పడ్డాను," అన్నాడు వంటవాడు.

వంటవాడు వెళ్ళి స్నానంచేసి వచ్చి, తన యజమానులకు వడ్డన చేశాడు. వాళ్ళు భోజనం చేసి, పడుకుని నిద్రపోయి, మళ్ళీ తూర్పు తెల్లవారుతూనే అడవికి వేటకు వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయిన కాస్సేపటికి హాస్య గత్తె మళ్ళీ వచ్చింది.

"నీ మొహం తగలెయ్యా! మళ్ళీ దాప రించావా?" అన్నాడు వంటవాడు.

"అలా కోపగించు కుంటావేం? నేనే మన్నా కావాలని నిన్ను తోశానా? నువు పడ్డాక నిన్ను బయటికి లాగటం నా వల్ల అయే పనా?" అన్నది హాస్యగత్తె.

"ఇంకెప్పుడూ అలాంటిపని చెయ్యకు, అంతే," అన్నాడు వంటవాడు.

"ఛీ, ఛీ! నేనెందుకు చేస్తాను? కాస్త తిండి పెడుదూ! నే నుండే చోట కడుపు నిండా తిండే పెట్టరు," అన్నది హాస్యగత్తె. వంటవాడు ఆమెకు భోజనం పెట్టాడు.

"సరేగాని, పెద్దయ్యా, మీ యజమానులు ఎప్పుడు వస్తారో నీ కెలా తెలుస్తుంది?" అని అడిగింది హాస్యగత్తె.

"చూస్తే తెలుస్తుంది," అన్నాడు వంటవాడు విసుక్కుంటూ.

"ఎక్కణ్ణుంచి చూస్తావు?" అన్నది హాస్యగత్తె.

వంటవాడు ఆమెను భవనం పై భాగానికి తీసుకుపోయి, అక్కడ ఉన్న ఎత్తయిన బురుజూ, అందులో ఉన్న గవాక్షమూ చూపించి, "అందులో నుంచి చూస్తాను, తెలిసిందా?" అన్నాడు.

"అబద్ధం! ఆ కిటికీ అంత ఎత్తున్నది గదా, అందులో నుంచి ఎలా చూడగలవు? నన్ను మరీ అమాయకురాలి కింద జమ కట్టెయ్యకు," అన్నది హాస్యగత్తె.





"అదుగో నిచ్చెన! అది వేసుకుని ఎక్కి చూస్తాను," అన్నాడు వంటవాడు.

"నిచ్చెన ఎక్కి, వాళ్ళు వస్తున్నారేమో ఒక్కసారి చూద్దూ! వాళ్ళు వచ్చి నన్ను చూశారంటే, నా ప్రాణాలు తీసేస్తారు," అన్నది హాస్యగత్తె.

వంటవాడు నిచ్చెనను కిటికీకి చేరవేసి ఎక్కి, కిటికీ అంచును చేతులతో పట్టుకుని బయటికి చూశాడు. అంతలోనే హాస్యగత్తె వాడి కాళ్ళ కింది నుంచి నిచ్చెనను లాగేసి, గబగబా కిందికి దిగిపోయి, వంట పాత్ర లన్నిటిలోనూ గుప్పెడు, గుప్పెడు ఉప్పు వేసి, రాజకుమార్తెల వద్దకు తిరిగి పోయింది.

ఆమె వాళ్ళతో జరిగినదంతా చెప్పేసరికి, రాజకుమార్తెలు ముగ్గురూ కడుపు నొప్పి వచ్చినదాకా నవ్వారు.

కాని వంటవాడికి మాత్రం కొంచెం కూడా నవ్వు రాలేదు. సాయంకాలం రాజకుమారులు వేట నుంచి తిరిగి వచ్చినదాకా వాడా గవాక్షం అంచు పట్టుకుని వేళ్ళాడుతూనే ఉన్నాడు.

రాజకుమారులు వాడి కోసం ఇల్లంతా వెతికి చివరకు బురుజు మీద చూసి, "ఒరే, అక్కడికి ఎలా ఎక్కావు?" అని అడిగారు.

"ఎలా ఎక్కానంటే, తమరు వస్తున్నారేమో చూతామని నిచ్చెన వేసుకుని ఎక్కాను. నిచ్చెన కాస్తా జారి పడింది," అన్నాడు వంటవాడు, రాజకుమారులు ఎత్తి పెట్టిన నిచ్చెన మీద కిందికి దిగి.

తరవాత వాళ్ళు భోజనానికి కూర్చుంటే భోజనమంతా ఉప్పుకషాయం! వాళ్ళు వంటవాడితో, "ఒరే, నీ కేదో తెగులు వచ్చింది. జాడీల్లో పడిపోతున్నావు, కిటికీలు పట్టుకు వేళ్ళాడుతున్నావు, వంటంతా ఉప్పుకషాయం చేసేస్తున్నావు. ఇలా అయితే నిన్ను సాగనంపాలిసిందే!" అన్నారు.

వంటవాడు ఈ మాటలకు పెద్ద పెట్టున ఏడిచి, రాజకుమారులకు మళ్ళీ వంట

చేసి, భోజనం పెట్టాడు. వాళ్ళు భోజనం చేసి, నిద్రపోయి, మళ్ళీ తెల్లవారుతూనే వేటకు వెళ్ళబోయేముందు, "నిజం చెప్పు. నీకేం వచ్చింది?" అని అడిగారు.

"అంతా ఆ ముండపనే!" అంటూ వంటవాడు జరిగినదంతా రాజకుమారులకు దాచకుండా చెప్పాడు. చెప్పి చివరకు, "ఈసారి ఆ ముండ యిక్కడికి వచ్చిందంటే దాన్ని తప్పకుండా గొంతు పిసికి చంపేస్తాను," అన్నాడు.

"అలాటి పని ఏమీ చెయ్యకు. ఇవాళ మేం వేట మానేసి దాక్కుంటాం. ఆ ముండ ఎక్కణ్ణుంచి వస్తున్నదో, ఈ వెధవ వేషాలెందుకు వేస్తున్నదో అంతు తేలుస్తాం," అన్నారు రాజకుమారులు. వాళ్ళు ఒక పెద్ద అలమారులో దాక్కున్నారు.

కొంతసేపయాక హాస్యగత్తె వచ్చి, "ఎలా ఉన్నావు, వంటాయనా!" అన్నది.

"నీ శ్రాద్ధం పెట్ట! నువ్వెందుకు నన్నిలా సైతాను పట్టినట్టు పట్టావు? నేను నా యజమానుల మొహం చూడలేక చస్తున్నాను," అన్నాడు వంటవాడు.

"ఓ యబ్బ! ఈ భాగ్యానికేనా? రాజకుమార్తెలకు వినోదం కలిగించటానికి చేస్తున్నాను. పాపం, వాళ్ళను ఒక వింతా,



వినోదమూ? ఏ వినోదమూ లేకపోతే వాళ్ళు వయసులో ఉండగానే ముసలివాళ్ళయిపోతారు!" అన్నది హాస్యగత్తె.

ఈ మాటలు వింటూనే రాజకుమారులు బయటికి వచ్చి, "ఇంతకూ నువ్వెవరు?" అని అడిగారు.

రాజుగారు యుద్ధానికి పోతూ, తన కుమార్తెలను కనిపెట్టి ఉండమని తనను నియోగించిన సంగతి హాస్యగత్తె రాజకుమారులకు చెప్పింది.

"ఈ రాజకుమార్తెలు అందమైన వాళ్ళేనా?" అని పెద్ద రాజకుమారుడు అడిగాడు.

"అందమా? నువు వాళ్లను చూస్తే మూర్ఛపోవా, నాయనా?" అన్నది హాస్యగత్తె.

"వాళ్ళను మాకు ఒకసారి చూపగలవా?" అని పెద్ద రాజకుమారుడు మళ్ళీ అడిగాడు.

"చూపగలను గాని, మీరు వాళ్ళకు తెలియకుండా చూడాలి," అన్నది హాస్యగత్తె. అందుకు రాజకుమారులు సమ్మతించారు.

హాస్యగత్తె రాజకుమార్తెల వద్దకు తిరిగి వెళ్ళి, "బయట ఉద్యానంలో ఎంత హాయిగా ఉందనుకున్నారు? అలా తిరిగి వద్దాం రండి," అంటూ వారిని బయలు దేర దీసి, ఉద్యానం చివరకు తెచ్చింది; రాతిపలక మీద కాలేసి, "అరె, ఇది కదులుతున్నదే!" అన్నది; దాన్ని ఎత్తి, "అబ్బో, దీని కింద మెట్లున్నాయే!" అన్నది; మెట్లు దిగి వచ్చి, "ఓయబ్బా, ఇక్కడేదో రాజభవనం ఉన్నదే!" అన్నది.

నలుగురూ రాజభవనం ప్రవేశించారు. లోపల ఎవరూ ఉన్న జాడ లేదు. రాజకుమారులు చాటు నుండి రాజకుమార్తెలను చూస్తూనే వాళ్ళను ప్రేమించారు. తరవాత వాళ్ళు రాజకుమార్తెల ఎదటపడి, తమను పెళ్ళాడమని కోరారు.

"పెళ్ళాడవచ్చు నన్రా! రాజకుమారులు నిక్షేపంగా ఉన్నారు. మీరు వాళ్ళను పెళ్ళాడితే, నేను వంటాయన్ను పెళ్ళాడతాను. కాని ముందు రాజుగారు యుద్ధం నుంచి తిరిగి రావాలి," అన్నది హాస్యగత్తె.

రాజుగారు యుద్ధంలో జయించి రావటం చేత మంచి ఉల్లాసంగా ఉన్నాడు. ఆయన తన కుమార్తెల వివాహానికి సంతోషంగా ఒప్పుకున్నాడు. ముగ్గురు రాజకుమార్తెలకూ, రాజకుమారులతో వైభవంగా పెళ్ళిళ్ళు జరిగాయి. ఆ సందట్లోనే హాస్యగత్తె కూడా వంటవాణ్ణి పెళ్ళి చేసుకున్నది. అంతా సుఖంగా ఉన్నారు.





# ముగ్గురు సన్యాసులు

చాలాకాలం క్రితం ఒక దేశంలో ఒక ధర్మ పరుడైన రాజుండేవాడు. ఒకనాడు ఆ రాజు వద్దకు ఒక సన్యాసి, తన ఇద్దరు శిష్యులతో వచ్చాడు. రాజు ఆ సన్యాసికి ఒక ఆసనం చూపి, అతిథి మర్యాదలన్నీ చేసి, ఆయన వచ్చిన పని అడిగాడు.

రాజు చూపిన ఆసనం మీద తన జింక తోలు పరిచి కూర్చుని ఆ సన్యాసి, "నేను నా ఈ శిష్యులతో తపస్సు చేసుకోవటానికి హిమాలయాలకు పోతున్నాను. ఈ రోజు మీ భిక్ష స్వీకరించి పోదామనుకున్నాం," అని చెప్పాడు.

"మీ కున్నది ఈ ఇద్దరు శిష్యులేనా?" అని రాజు అడిగాడు.

"శిష్యులుగా ఉంటామని చాలామంది వచ్చారు రావటానికి. కాని వాళ్ళంతా అర్హులు కారు. అందుచేత వీరిద్దరినే వెంట ఉంచుకున్నాను," అన్నాడు సన్యాసి.

అంతలో రాజాస్థానానికి మరొక సన్యాసి వచ్చాడు. ఆయన వెంట ఎనిమిదిమంది శిష్యులున్నారు. రాజుగారు ఆయనకు కూడా స్వాగతం తెలిపి, కూర్చోవటానికి ఆసనం చూపి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"ప్రపంచక్షేమం కోరి దేశసంచారం చేస్తున్నాం. నిన్ను అనుగ్రహించి వెళ్ళాలని పించి, ఇలా రావటం జరిగింది," అన్నాడు రెండోసన్యాసి.

ఇంతలో మూడో సన్యాసి ఆడంబరంగా పాలకిలో వచ్చి దిగాడు. ఆయన వెంట పన్నెండు మంది శిష్యులున్నారు. ఆయన ఆస్థానంలోకి అడుగుపెడుతూనే, "విజయీభవ! దానధర్మ ప్రవీణుడనే కీర్తి నీకు శాశ్వతంగా దక్కుగాక!" అని రాజును ఆశీర్వదించాడు.

రాజు ఈ మూడో సన్యాసికి కూడా స్వాగతం తెలిపి, ఒక ఆసనం చూపాడు.

బి. సురేంద్రనాథ్





"అదేమిటి? భోజన పదార్థాలన్నీ వదిలేశారు! రుచిగా లేవా?" అని రాజు మొదటి సన్యాసిని అడిగాడు.

"రుచిమాట దేవుడెరుగు. కడుపు నిండింది. తృప్తి అయింది," అన్నాడు మొదటి సన్యాసి. రెండో సన్యాసీ, అతని శిష్యులూ తమ పళ్ళాలలోని పదార్థాలన్నీ పూర్తిగా తినేసి, అడిగి పెట్టించుకోవటం భావ్యం కాదనుకుని, లేచారు.

మూడో సన్యాసీ, అతని శిష్యులూ కూడా పళ్ళాలు ఖాళీచేసి, ఇంకా వడ్డించండని వడ్డనవాళ్ళకు సైగచేశారు. ఇంక లేదన్నట్టు వడ్డనవాళ్ళు సైగచేశారు.

"రాజుగారింట్లోకూడా తిండి కరువేనా?" అని గొణుగుతూ మూడో సన్యాసి లేచాడు.

భోజనాలయిపోయాక రాజు ముగ్గురు సన్యాసుల ముందూ మూడు పళ్ళాలుంచి, "స్వీకరించండి!" అన్నాడు. ఒక్కొక్క పళ్ళెంలోనూ వెయ్యేసి నాణాలున్నాయి.

మొదటి సన్యాసి తన ముందున్న పళ్ళెం కేసి ఒకసారి చూసి, తన శిష్యులకు సైగ చేశాడు. వాళ్ళా పళ్ళాన్ని తీసుకుని బయటికి వెళ్ళిపోయారు.

రెండో సన్యాసి తన ముందున్న పళ్ళెంలోని నాణాలను శ్రద్ధగా ఎంచి, వాటిని తన

అయన శిష్యులు తమ గురువును గురించి, సన్యాసులకు చక్రవర్తి అనీ, అష్టసిద్ధులూ పొందినవాడనీ, ఆయనను సంతోషపెట్టటం రాజుకూ, రాజ్యానికీ కూడా ఎంతో క్షేమమనీ రాజుతో అన్నారు.

కొంతసేపయాక రాజు ముగ్గురు సన్యాసులనూ, వారి శిష్యులనూ భోజనశాలకు తీసుకుపోయాడు. అందరికీ పళ్ళాలలో దివ్యమైన భోజన పదార్థాలు వడ్డించారు.

మొదటి సన్యాసి కళ్ళు మూసుకుని, తన పళ్ళెం నుంచి మూడే మూడు ముద్దలు తీసుకుని తిని లేచి చెయ్యి కడుక్కున్నాడు. అతని ఇద్దరు శిష్యులూ అలాగే చేశారు.

శిష్యులకు వ్యత్యాసంగా పంచిపెట్టాడు; అందరికీ సమంగా పంచలేదు.

మూడో సన్యాసి నాణాలను ముట్టక, రాజు కేసి కోపంగా చూడసాగాడు.

రాజుగారు సన్యాసులతో, "తమ కింకేమైనా కోరికలుంటే చెప్పండి," అన్నాడు.

"నాకూ, నా ఇద్దరు శిష్యులకూ తలా ఒక కావితుండూ ఇప్పిస్తే కట్టుకుంటాం. ఏది జయించినా దేహాభిమానాన్ని ఇంకా జయించలేదు," అన్నాడు మొదటి సన్యాసి.

"రాజా, కొత్త బట్టలు ఒక మూట ఇప్పిస్తే మా తిప్పలు మేంపడతాం!" అన్నాడు రెండో సన్యాసి.

మూడో సన్యాసి మటుకు, "రాజా, నీ నక్కవినయాలకు నేను మోసపోయేవాణ్ణి కాను. పట్టు శాపం!" అని హుంకరించాడు.

రాజు ఆశ్చర్యంగా, "దేనికి? నావల్ల ఏం తప్పు జరిగింది?" అని అడిగాడు.

"ఒక తప్పా? నీకు తారతమ్య విచక్షణ లేదు. ఆకలి మందగించిన జబ్బుమనిషికీ, నాకూ ఒకే విధంగా భోజనం పెట్టావు. నా ఆకలి కూడా తీర్చలేకపోయావు. వాళ్ళిద్దరికన్నా హీనమైన ఆసనం నాకిచ్చావు. ఇద్దరు శిష్యులున్నవాడికీ, నాకూ ఒకే రకంగా కానుకలిచ్చావు. అయిందేదో



అయింది. నాకూ, నా పన్నెండుమంది శిష్యులకూ తలా ఒక వెయ్యి నాణాలూ, కొత్త బట్టలూ ఇచ్చావా నిన్ను క్షమించి, దీవించి పోతాను. లేదా, నా శాపాగ్నితో నిన్ను సర్వనాశనం చేస్తాను," అన్నాడు మూడో సన్యాసి.

రాజు రెండో సన్యాసి కేసి తిరిగి, "అయ్యా, మీరు కూర్చున్నది ఏ ఆసనం?" అని అడిగాడు.

"వెండిది," అన్నాడు రెండో సన్యాసి.

రాజు మొదటి సన్యాసిని అదే ప్రశ్న వేశాడు. "ఆసనం ఎటువంటిదో నాకు తెలీదు నేను నా జింకతోలు పైన కూర్చున్నాను.

అంతే నాకు తెలుసు," అన్నాడు మొదటి సన్యాసి.

"చూశావా? తాను ఏ ఆసనం మీద కూర్చున్నదీ తెలియని జడుడికి బంగారు ఆసనం ఇచ్చి, నాకు ఇత్తడి ఆసనం ఇచ్చావు!" అన్నాడు మూడో సన్యాసి.

రాజు చిరునవ్వు నవ్వి, "అదంతా ఏమీ లేదు. మొదట వచ్చిన వారికి బంగారు ఆసనం ఇచ్చాను. తరవాత వచ్చినవారికి వెండిది ఇచ్చాను. ఆఖరుకు వచ్చినవారికి ఇత్తడిది చూపాను. ఇది నేను కావాలని చేసిన పనికాదు. కాని ఆ ఆసనాలు మీమీ అర్హతలకు తగినట్టే కుదిరాయనుకుంటున్నాను. మొదటి సన్యాసి నిజమైన సన్యాసి, ఇంద్రియాతీతుడు. రెండో సన్యాసి సాధకం చేస్తున్నాడేగాని ఇంకా ఇంద్రియాలకు అతీతుడు కాలేదు. నువు పట్టి వేషధారివి! బూటకపు సన్యాసివి! ఉదర పోషణార్థం ఈ వేషం వేశావు. రేపటి నుంచీ నువుగాని, నీ శిష్యులుగాని నా రాజ్యంలో కనిపిస్తే చెరసాలలో పెట్టిస్తాను. నీవంటివాడి శాపాలను నేను లక్ష్యపెట్టను," అన్నాడు. మూడో సన్యాసీ, అతడి శిష్యులూ తలలు వంచుకుని వెళ్ళిపోయారు.

ఈలోపుగా మొదటి సన్యాసి శిష్యులు రాజుగారిచ్చిన వెయ్యి బంగారునాణాలనూ బీదసాదలకు దానంచేసి, ఖాళీ పళ్ళెంతో తిరిగి వచ్చారు.

ఇదంతా చూస్తూ ఉండిన రెండో సన్యాసి తన శిష్యుల కేసి తిరిగి, "నేను మీకు గురువుగా ఉండదగను. మీదారిన మీరు వెళ్ళండి. నేను ఈయనకు శిష్యుడుగా ఉంటాను," అని మొదటి సన్యాసి కాళ్ళపైన పడి, "నన్ను మీ శిష్యుడుగా స్వీకరించండి. ఈ రాజు నా కళ్ళు తెరిచాడు," అన్నాడు.

మొదటి సన్యాసి అందుకు సమ్మతించి, రాజును దీవించి, తన ముగ్గురు శిష్యులనూ వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు.






# బొమ్మకూతుళ్ళు

చాలాకాలం క్రితం ఒక యవననగరంలో ఒకా చెప్పులుకుట్టేవా డుండేవాడు. వాడి ఇల్లంతా కలిసి ఒకే గది. దానికి ఒకటే కిటికీ, ఒకటే వాకిలీ ఉండేవి. ఉదయం పూట ఇల్లు వదిలి, రోజల్లా తన పని చూసు కుని, సాయంకాలానికి ఇంటికి వచ్చి, భోజనం చేసి తన గదిలో పడుకునేవాడు.

వృద్ధాప్యం వచ్చిన దాకా చెప్పులుకుట్టే వాడు ఇలాగే జీవించి, ఒకనాడు, "నాది ఏం బతుకు! పిల్లలుంటే జీవితం ఎంత ఆ౯ందంగా ఉండేది!" అనుకున్నాడు. కాని వాడికి మొదలు భార్యే లేదు, పిల్ల లెలా ఉంకారు?

పిల్లలు లేని లోటు తీరటానికి వాడు ఏంచేశాడంటే, పిండితో బాగా ఎదిగి ఈడు వచ్చిన ఆడపిల్లల బొమ్మలు మూడు తయారుచేసి, మూటికీ తేడా తెలియగలందు లకు ఒక బొమ్మకు తెల్లదుస్తులూ, ఇంకో బొమ్మకు నీలందుస్తులూ, మూడోబొమ్మకు ఎర్రదుస్తులూ తొడిగాడు.

మర్నాడు వాడు తన పని చూసుకోవ టానికి పోతూ, కిటికీ దగ్గిర ఒక కుర్చీ వేసి, దాని మీద తెల్లదుస్తుల బొమ్మను కూర్చో బెట్టి, "అమ్మాయీ, నేను మళ్ళీ సాయం కాలం వస్తాను. అంతదాకా నువు సము ద్రాన్నీ, దాని మీద పోయే పడవలనూ చూస్తూ కూర్చో. మనం పరువైనవాళ్ళం. అందుచేత ఇంటిముందుగా వెళ్ళే జనాన్ని చూడకు. వాళ్ళు పలకరిస్తే జవాబు చెప్పకు. తెలిసిందా?" అని హెచ్చరించి, వాకిలికి తాళంపెట్టి వెళ్ళిపోయాడు.

దారేపొయ్యే ప్రతివాడూ ఆ బొమ్మ కేసి చూసి, "ఆ అమ్మాయి ఎంత అందంగా ఉందో! ఆమెకు ఎంత నిక్కో చూశావా? జనం కేసి చూడనే చూడటంలేదు," అను కుంటూ వెళ్ళారు.

వి. సత్యనారాయణ



కొంతసేపటికి అటుగా రాజుకొడుకు షికారుగా వచ్చాడు. బొమ్మను చూడగానే అతను ఆగిపోయి, కిటికీని సమీపించి, "సుందరీ, ఏమి నీ అందం! ఒక్కసారి నా కేసి చూసి, చిన్న నవ్వునవ్వి, నాతో మాట్లాడవా?" అన్నాడు.

బొమ్మ కదలలేదు, జవాబు అసలే చెప్పలేదు.

"పలుకే బంగారమా? నేను నిన్ను ప్రేమిస్తున్నాను, సుందరీ. నన్ను పెళ్ళాడతావా? పెళ్ళాడితే నీకు కిరీటం పెట్టి, నీ ఒంటి నిండా రత్నాభరణాలు దిగవేస్తాను. నాతో మాట్లాడటం ఇష్టం లేకపోతే నా కేసి ఒక్కసారి చూడనైనా చూడు," అన్నాడు రాజుకొడుకు.

అప్పటికీ బొమ్మ చలించలేదు.

"నేను నిన్ను ఇంతతో వదలను. రేపు మళ్ళీ వస్తాను. అంతదాకా ఇది బహుమానంగా ఉంచుకో," అంటూ రాజుకొడుకు ఒక బంగారు ఉంగరం ఆమె ఒడిలోకి విసిరివేసి, ముందుకు సాగిపోయాడు.

సాయంకాల మయింది. చెప్పులుకుట్టేవాడు ఇంటికి తిరిగి వచ్చి, "ఒంటరిగా నీకు రోజల్లా తోచిందా, తల్లీ? ఇక మనం కబుర్లు చెప్పుకుంటూ సరదాగా భోజనం చేద్దాం," అని బొమ్మను కుర్చీపై నుంచి ఎత్తాడు. బొమ్మ ఒడిలో ఉన్న బంగారు ఉంగరం కిందపడింది.

చెప్పులుకుట్టేవాడు పట్టరాని ఆగ్రహంతో బొమ్మను కింద పారేసి, "ఛీ, పాపిష్టిదానా, నే నలా అవతలికి వెళ్ళగానే దారేపొయ్యే వాళ్ళ నుంచి కానుకలు పుచ్చుకుంటావా? నువు నా కూతురుగా ఉండదగవు!" అంటూ ఆ బొమ్మను విరిచి ముక్కలుచేశాడు.

మర్నాడు ఉదయం అతను బయటికి పోతూ కిటికీ వద్ద నీలందుస్తుల బొమ్మను కూర్చోబెట్టి, "తల్లీ, నేను సాయంకాలనికి తిరిగి వచ్చినదాకా సముద్రం మీది పడవల



కూతురు వద్దు," అంటూ ఆ బొమ్మను కూడా నాశనం చేసేశాడు.

మూడోనాటి ఉదయం చెప్పులు కుట్టే వాడు ఎర్రదుస్తుల బొమ్మను కిటికీ వద్ద కూర్చోబెట్టి, ముందు బొమ్మలను హెచ్చరించినట్టే హెచ్చరించి వెళ్ళిపోయాడు.

తరవాత రాజుకొడుకు వచ్చి, ఆ బొమ్మ ధరించిన ఎర్రదుస్తులను మరింత ఘనంగా మెచ్చుకుని, తన కేసి చూడమనీ, తనను పెళ్ళాడమనీ, ఎంతో దీనంగా వేడుకున్నాడు. కాని లాభం లేకపోయింది.

"నీకు అందమైతే ఉందిగాని, నీ హృదయం పాషాణం. దాన్ని నేను కరిగిస్తాను. నువు నన్ను పెళ్ళాడతానని చెప్పేదాకా రోజూ వస్తాను. ఇదిగో ఇది కూడా ఉంచుకో," అని ఒక వజ్రపుటుంగరం బొమ్మ ఒడిలోకి విసిరివేసి, కన్నీరు తుడుచుకుంటూ రాజుకొడుకు వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం చెప్పులుకుట్టేవాడు ఇంటికి తిరిగి వచ్చి, బొమ్మ ఒడిలో ఉన్న వజ్రపుటుంగరాన్ని చూసి, "మీ వంటి కూతుళ్ళుండి అప్రతిష్ఠపాలయేకన్న పిల్లలు లేకపోవటమే నయం," అంటూ మూడో బొమ్మను కూడా ధ్వంసం చేసి పారేశాడు.

మర్నాడు బయటికి వెళ్ళేటప్పుడు చెప్పులుకుట్టేవాడు కిటికీ రెక్కలు మూసి, తలుపు తాళంవేసి తన పని మీద నగరంలోకి పోయాడు.

రాజుకొడుకు అటుగా వచ్చి, కిటికీ మూసి ఉండటం చూసి హతాశుడయాడు. అతను మూడు నాలుగురోజులు వరసగా వచ్చి, తన సుందరిని చూడటానికి కూడా లేదని గ్రహించి ఇంటికి వెళ్ళిపోయి, దిగులుతో మంచం పట్టాడు.

తన కొడుకు జబ్బుగా ఉండటం చూసి రాజు రాజవైద్యుణ్ణి పిలిచాడు. ఆ వైద్యుడు వచ్చి రాజుకొడుకుని పరీక్షించి, "మహారాజా, ఇది మనోవ్యాధి. దీనికి మందులేదు. మనో

వ్యాధికి కారణం ఏమిటో విచారించి, దాన్ని తొలగించండి," అన్నాడు.

రాజు అడిగిన మీదట రాజుకొడుకు, "నాన్నా, నేను చెప్పులుకుట్టేవాడి కూతురైన సుందరిని ప్రేమిస్తున్నాను. ఆమెను పెళ్ళాడకపోతే బతకను," అన్నాడు.

"ఇంతేగద! రేపీపాటికి నీకా పిల్లనిచ్చి పెళ్లిచేస్తాను, సరా? విచారించకు!" అన్నాడు రాజు.

రాజుగారు చెప్పులుకుట్టేవాణ్ణి పిలిపించి, "నీ కూతుర్ని రాజభవనానికి వెంటనే తీసుకురా!" అని ఆజ్ఞాపించాడు.

"అది సాధ్యంకాని పని, మహారాజా!" అన్నాడు చెప్పులుకుట్టేవాడు.

"సాధ్యం కాదూ? ఎందుచేత కాదూ?" అన్నాడు రాజు.

"నాకు పిల్లలే లేరు, మహారాజా," అన్నాడు చెప్పులుకుట్టేవాడు తడబడుతూ.

రాజు మాట నమ్మక, "నీ కూతుర్ని సాయంకాలం లోపల తీసుకురాకపోయావో నీ తల ఎగిరిపోతుంది. వెళ్ళు!" అన్నాడు.

చెప్పులుకుట్టేవాడికి బుర్ర అంతా పాడైపోయింది. ఏమి చెయ్యటానికీ పాలుపోక అతను అడవి కేసి పరధ్యానంగా నడుచుకుంటూ వెళ్ళాడు.



అడవిలో పుల్లలేరుకుంటున్న ఒక ముసలమ్మ అతన్ని చూసి, "ఎక్కడికి నాయనా, పోతున్నావు?" అని అడిగింది.

"నా జోలికి రామాకు. నేను కొండ మీది నుంచి దూకి చావబోతున్నాను," అన్నాడు చెప్పులుకుట్టేవాడు.

"ఛీ, ఛీ! అదేం పని? అంత కష్టమేమి వచ్చింది?" అన్నది ముసలమ్మ.

చెప్పులుకుట్టేవాడు తన కథ అంతా ముసలిదానికి చెప్పాడు.

"అయితే ఒక పని చెయ్యి. నేను నీకొక పుల్ల ఇస్తాను. దానితో సముద్రం నీటి మీద కొట్టుతూ, 'వరుణదేవుడా, నీ కుమా

ర్తెను పంపు. రాజుగారి కొడుకొచ్చి పెళ్లి చేస్తాను,' అను. పని గడుస్తుంది," అన్నది.

"పరాచకాలాడటానికి నేనే దొరికానా నీకు?" అన్నాడు చెప్పులుకుట్టేవాడు విసుగుగా.

"పరాచకాలు కాదు, నాయనా. నేను చెప్పినట్టు చెయ్యి. ఇంతలో నీ కొచ్చిన నష్టం ఏమున్నదీ?" అంటూ ముసలిది తన చేతిలో ఉన్న పుల్లలలో ఒకటి ఎంచి అతని కిచ్చింది.

చెప్పులుకుట్టేవాడు దాన్ని తీసుకుని సముద్రానికి వెళ్లి, మోకాటిలోతు నీటిలో నిలబడి, నీటి మీద కొట్టుతూ, ముసలిది అనమన్నట్టే, "వరుణదేవుడా, నీ కుమార్తెను పంపు. రాజుగారి కొడుకొచ్చి పెళ్లి చేస్తాను," అన్నాడు.

అతని మాటలు పూర్తి అయేలోపుగా నిలువెత్తు అల ఒడ్డుదాకా వచ్చి విరిగి పోయింది. ఆ అల విరిగిన చోట ఒక బంగారుబొమ్మ లాంటి పిల్ల, ఇంద్రధనుస్సు రంగులతో వెలిగిపోయే దుస్తులు ధరించి నిలబడి ఉన్నది.

చెప్పులుకుట్టేవాడికి ప్రాణం లేచి వచ్చింది. "రా, తల్లీ, రా!" అంటూ అతను ఆ పిల్లను చెయ్యిపట్టుకుని రాజ భవనానికి తీసుకుపోయాడు. రాజు ఆమెను చూడగానే నిర్ఘాంతపోయాడు. తన కొడుకు ఆమె కోసం మనోవ్యాధి పడ్డాడంటే ఆశ్చర్యం లేదనుకున్నాడు.

రాజకుమారుడు ఆమెను చూసి, "ఆహా, సుందరీ! నీ అందంలో నేను సగం కూడా ఇదివరలో చూడలేదు!" అన్నాడు.

వరుణదేవుడి కూతురుకూ, రాజకుమారుడికీ పెళ్లి అయిపోయింది. రాజుగారి వియ్యంకుడు చెప్పులుకుట్టుకుంటూ జీవించటం భావ్యంగా ఉండదు గనక, అతన్ని కూడా రాజభవనంలో ఉండమని, అతనికి పాదరక్షాశాఖామంత్రి పదవి ఇచ్చారు.






# బండనాగన్న

ఒక గ్రామంలో ఒక అయ్యవారు ఉండే వాడు. ఆయన దగ్గిర చాలామంది కుర్ర వాళ్ళు చదువుకుంటూ ఉండేవాళ్ళు.

ఆయన దగ్గిర చదువు చెప్పుకునే కుర్ర వాళ్ళలో నాగన్న అని ఒకడు ఉండేవాడు. వాడికి తెలివితేటలు బొత్తిగా లేవు.

ఒక రోజు అయ్యవారు నాగన్నను పిలిచి, "ఒరే, బండవాడా, నువు గ్రామ పెద్ద ఇంటికి వెళ్ళి, చెట్టుగలవారిని అడిగి, నేను తెమ్మన్నానని నాలుగు కొబ్బరికాయలు పట్టుకురా," అని గోతం ఇచ్చి పంపాడు.

నాగన్న గ్రామపెద్ద ఇంటికి వెళ్ళాడు. కాని చెట్టుగల వాళ్ళంటే ఎవరో తెలియ లేదు. అందుచేత వాడు చెట్టుకు ఎదురుగా నిలబడి, "అయ్యవారు నాలుగు టెంకా యలు తెమ్మన్నారు," అన్నాడు.

చెట్టు జవాబు చెప్పలేదు. చెట్టు అభ్యం తరం చెప్పలేదు గదా అనుకుని నాగన్న చెట్టెక్కి నాలుగు కొబ్బరికాయలు కోసి, వాటిని తెచ్చి, అయ్యవారి కిచ్చాడు.

కాని కాస్సేపటికి గ్రామపెద్ద వచ్చి అయ్య వారితో, "కొబ్బరికాయలు కావాలంటే అడిగి మరీ కోసుకోరా?" అని కోప్పడ్డాడు.

"బండవాడు మీతో చెప్పాడనుకున్నానే. వాణ్ణి కోప్పడతా లెండి," అని అయ్యవారు గ్రామపెద్దను సమాధానపరిచి పంపేసి, నాగన్నను పిలిచి, "టెంకాయలు ఎవరి నడిగి తెచ్చావురా?" అని అడిగాడు.

"చెట్టు నడిగేనండీ," అన్నాడు నాగన్న.

"నీకు బుద్ధి లేదురా. అందుకే, 'చదువు లేని మొద్దూ, కదలలేని ఎద్దూ,' అన్నారు. నువు పశువుల్ని కాయటానికి తప్ప ఇంకెం దుకూ పనికిరావు. రేపటి నుంచీ గొడ్లను కాయి," అన్నాడు అయ్యవారు.

మర్నాటి నుంచీ బండ నాగన్న అయ్య వారి పశువులను మేప నారంభించాడు.

పఠాన్‌ఖాదర్ వలీఖాన్




అయ్యవారు అన్న మాటలు వాడికి సరిగా అర్థం కాలేదు. కదలని ఎద్దును కదిలిస్తే చదువు బాగా వస్తుంది కాబోలునని వాడు అనుకున్నాడు.

అయ్యవారు ఊళ్ళోని శివాలయానికి పూజారి. నాగన్న ఒకసారి ఆ శివాలయానికి వెళితే అక్కడ నంది కనిపించింది. అది కదలని ఎద్దు గనక, దాన్ని కదిలిస్తే తనకు చదువు వస్తుంది అనుకుని వాడు ఆ నందిని బలంగా తోశాడు. చిత్రంగా నంది పక్కకు ఒరిగి పడిపోయింది. దాని కింద ఒక గుంట ఉన్నది. దానిలో డబ్బూ, నగలూ ఉన్నాయి. గుడికి వచ్చినవారంతా ఇది చూశారు.

గుడికి వచ్చే ఆదాయంలోనూ, కానుకల లోనూ అయ్యవారు చేతివాటు వేసిన వాటిని అక్కడ దాస్తున్నాడు. ఆ రహస్యం కాస్తా బయట పడిపోయింది. ఇటువంటి పనులు ఇక ఎన్నడూ చెయ్యనని గ్రామంలోని పెద్ద లందరి దగ్గిరా చెంపలు వేసుకున్నాడు అయ్యవారు.

ఆయన ఇంటికి చేరుతూనే నాగన్నతో, "నీకు చదువు చెప్పటం నా బుద్ధితక్కువే. ఇక ఒక్క క్షణం కూడా ఇక్కడ ఉండకు. వెళ్లిపో," అన్నాడు.

నాగన్న కళ్ళనీళ్ళ పర్యంతమై, "మీరు చెప్పిన చదువు నాకేమీ అంట లేదు. రెండు నీతివాక్యాలు చెప్పండి, నేను పోతాను," అన్నాడు.

"కాకిముక్కుకు దొండపండులాగా నీకు నీతివాక్యా లెందుకురా?" అన్నాడు అయ్యవారు కోపంగా.

"నా గతేం గాను?" అన్నాడు నాగన్న.

"ఏమో, ఎవరు చెప్పగలరు? రానున్నది రాకమానదు, కానున్నది కాకమానదు. వెళ్ళు," అన్నాడు అయ్యవారు.

నాగన్న తన చిన్న మూట నెత్తిన పెట్టుకుని, "కాకి ముక్కుకు దొండపండు! రానున్నది రాకమానదు, కానున్నది కాక

మానదు!" అని గురువుగారన్న మాటలు పల్లె వేస్తూ, తన ఊరి దారి పట్టాడు.

దారిలో నాగన్నకు ఒక చెట్టు మీద కాకి వచ్చి వాలటం కనిపించింది. దాని ముక్కున ఏదో ఎర్రగా ధగధగలాడుతున్నది. అయ్యవారు చెప్పిన "కాకి ముక్కుకు దొండ పండు" అదే కాబోలు ననుకున్నాడు వాడు. కాకి ముక్కుకు దొండపండు తగదన్నట్టుగా అయ్యవారు మాట్లాడారు. అందుకని నాగన్న, ఆ ఎర్రటి వస్తువును కొమ్మ మీద ఉంచి ముక్కుతో పొడుస్తున్న సమయంలో, కాకిని అదిలించాడు. ఆ వస్తువు కిందపడింది.

నాగన్న దాన్ని తీసి చూస్తే కెంపులు పొదిగిన ఉంగరం. గురువుగారి మాట పాటించినందుకు చక్కని ఉంగరం దొరికింది గదా అని సంతోషించి, నాగన్న దాన్ని తన వేలికి పెట్టుకుని ముందుకు సాగాడు.

ఇంతకూ ఆ ఉంగరం రాజకుమార్తెది. అది ఆమెకు ప్రాణ సమానమైనది. అది పోయినప్పటినుంచీ రాజభటులు దానికోసం వెతుకుతున్నారు. నాగన్న ఆ ఉంగరంతో వాళ్ళ కంట బడేసరికి, వాళ్ళు అతన్ని పట్టుకుని రాజుగారి దగ్గిరికి తీసుకుపోయారు. "రానున్నది రాకమానదు, కానున్నది కాక మానదు" అని అయ్యవారు చెప్పనే చెప్పాడు. రానున్నదీ, కానున్నదీ ఏమిటో తెలుసుకోవాలని నాగన్నకు అభిలాష కలిగింది.

రాజుగారు నాగన్నను, "నీకీ ఉంగరం ఎలా దొరికింది?" అని అడిగాడు.

"ఒక కాకి ఇచ్చింది," అన్నాడు నాగన్న. సభవారంతా గొల్లున నవ్వారు.

నాగన్న అమాయకుడని గ్రహించి రాజుగారు అతన్ని విషయాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. అంత అమాయకుడు స్వశక్తితో బతకలేడు గనక, అయన నాగన్న జీవితాంతం వరకూ సుఖంగా జరిగిపోయేటట్టు ఏర్పాటు చేశాడు.






# మనిషి ఆయుర్దాయం

తాతయ్య వచ్చేసరికి పిల్లలు తలా ఒక మాటా అని కిలకిలా నవ్వుకుంటున్నారు.

"కోతి! అచ్చు కోతే!"

"కోతల్లే బోసినోరు మాటిమాటికీ ఆడిస్తాడు!"

"కళ్ళార్పుతాడు కూడా!"

"కోపం వస్తే, గుర్ గుర్, అంటాడు!"

"ఎవరినర్రా వెక్కిరిస్తున్నారూ?" అన్నాడు తాతయ్య, చేతికర్ర మూల అనించి, కుర్చీలో నడుమువాలుస్తూ.

"మన వీధి చివర ఉండే ముసలాయన, తాతయ్యా. నీ కోసం వచ్చి చాలా సేపు కూర్చుని వెళ్ళాడు, తాతయ్యా!" అన్నారు పిల్లలు.

తాతయ్య పొడుంకాయ తీసి, ఎడమ అరిచేతిలో పొడుం వేసుకుంటూ, "ఆ ముసలాయన కెన్నేళ్ళో మీకు తెలుసునా?" అని అడిగాడు.

"డెబ్భై....తొంభై....నూట ఇరవై...." అని తలా ఒక మాటా అన్నారు పిల్లలు.

"అందుకే కోతల్లే మీకు కనిపిస్తున్నాడు," అన్నాడు తాతయ్య.

"అదేమిటి, తాతయ్యా?" అన్నారు పిల్లలు తాతయ్య మాట అర్థంకాక.

"మీకు కథ చెప్పాను కాదుటర్రా?" అన్నాడు తాతయ్య.

"లేదు, తాతయ్యా!....చెప్పు తాతయ్యా! అదేం కథ, తాతయ్యా!" అని పిల్లలు చుట్టూ మూగారు.

"మనిషి ఆయుర్దాయం కథ! చెప్పలేదు గామాలు. ఇప్పుడు చెబుతాను. వినండి," అంటూ తాతయ్య పొడుం పీల్చి, కథ ఆరంభించాడు:

బ్రహ్మదేవుడు సృష్టి అంతా పూర్తిచేశాక మనిషికి ప్రకృతి నంతా చూపించి, "దీని మీద నీదే పెత్తనమోయ్!" అన్నాడు.

బ్రహ్మదేవుడు సృష్టించిన కొండలనూ, వనాలనూ, నదులనూ, సముద్రాలనూ, గొప్ప మైదానాలనూ చూసి మనిషి ఎంతో ఆనందపడి, "అయితే, తాతగారూ, ఈ ప్రకృతి మీద నే నెంత కాలం పెత్తనం చేస్తాను?" అని అడిగాడు.

"నీకు ముప్ఫై ఏళ్ళు ఆయుర్దాయం నిర్ణయించాను, బాబూ," అన్నాడు బ్రహ్మ దేవుడు.

"ఇంతేనా? నా ఆయుర్దాయం ఇంకా స్త పెంచండి, తాతగారూ!" అని మనిషి బ్రహ్మను వేడుకున్నాడు.

"అది నా చేతిలో ఉన్నది కాదు, నాయనా! నేను సృష్టించిన ఇతర మృగాలు తమ ఆయుర్దాయంలో నీకు భాగం ఇస్తా యేమో చూద్దాం. ఆ విధంగా నీ ఆయుర్దాయం మరి కొంత పెరగవచ్చు," అని బ్రహ్మదేవు డన్నాడు.

ఆయన గాడిదను పిలిచి, "చూడు, గాడిదా. నిన్ను బరువులు మొయ్యటానికీ, తిట్లుతినడానికీ, గడ్డిమెయ్యడానికి సృష్టించాను," అన్నాడు.

"అబ్బో, అది చాలా ఘోరమైన బతుకే. అలా ఎంతకాలం బతకాలి, తాతగారూ?" అని గాడిద అడిగింది.




"నీ ఆయుర్దాయం నలభైఏళ్ళు," అన్నాడు బ్రహ్మ.

"అంతెందుకు? సగం చాలు, తాత గారూ," అన్నది గాడిద. ఆ విధంగా గాడిద ఆయుర్దాయంలో ఇరవై ఏళ్ళు మనిషికి దక్కాయి.

తరవాత బ్రహ్మదేవుడు కుక్కను పిలిచి, "మనిషికి కాపలా ఉండటానికీ, విశ్వాసంతో మనిషిని కొలవటానికీ, మనిషి పెట్టినది తినటానికి నిన్ను సృష్టించాను. నీ ఆయుర్దాయం నలభై సంవత్సరాలు," అన్నాడు.

"అంత హీనమైన బతుక్కు సగం ఆయుర్దాయం చాలు, బాబూ," అన్నది

కుక్క మనిషి ఆయుర్దాయం మరో ఇరవై ఏళ్ళు పెరిగింది.

ఆ తరవాత బ్రహ్మదేవుడు కోతిని పిలిచి, "కోతీ, నిన్ను చూసి అందరూ వినోదించటం కోసం సృష్టించాను. నీ చూపూ, నడకా, వాలకమూ. వింతగా వుంటుంది. నువు చెట్లూ, చేమలూ ఆశ్రయించుకుని బతుకు తావు," అన్నాడు.

"ఎన్నేళ్ళు అలా బతుకుతాను, తాతా?" అని కోతి అడిగింది.

"అరవయ్యేళ్ళు," అన్నాడు బ్రహ్మ.

"అంత ఆయుర్దాయం నాకు వద్దులే, తాతా. అందులో సగం యివ్వు చాలు," అన్నది కోతి.

ఇతర మృగాలు ఇచ్చిన ఆయుర్దాయ భాగాలవల్ల మనిషి ఆయుర్దాయం శత మాన మయింది. అంటే నూరేళ్ళు.

"చూశారుటర్రా? మనిషి నూరేళ్ళు బతికినా, మొదటి ముప్ఫయ్యేళ్ళే నిజమైన మనిషి బతుకు! ఆ తరవాత ఇరవయ్యేళ్ళూ పెళ్ళాం పిల్లల కోసం అడ్డమైన చాకిరీ చేసి, మనిషి గాడిదలా బతుకుతాడు. యాభై నుంచి డెబ్భై దాకా మనమలనూ, వాళ్ళ మంచిచెడ్డలనూ కనిపెట్టి ఉంటూ, వాళ్ళు పడేసేది తింటూ కుక్కబతుకు బతుకు తాడు. డెబ్భై దాటాక, చూశారూ, పళ్ళూడి, కంటి చూపు అనక, దొడ్డికాళ్ళు పడి నడుస్తూ కోతిలా బతుకుతాడు. మీరా ముస లాయన్ను కోతి అనటంలో వింతేమిటీ? కోతిని చూసి సంతోషించినట్టే మీ రాయన్ను చూసి సంతోషిస్తున్నారు," అని తాతయ్య ముగించాడు.

"అయితే, ఇప్పుడు నీది ఏ బతుకు, తాతయ్యా?" అని కొంటెకోణంగి అడిగాడు.

"గాడిదల్లారా, అస్తమానమూ కథలూ, కబుర్లూ తప్ప మీకు చదువూ, సంధ్యా లేదల్లే ఉందే! పదండి, వెళ్ళి చదువు కోండి," అని తాతయ్య పిల్లల్ని తరిమేశాడు.





# మందమతులు

ఒకప్పుడు యెమెన్‌దేశంలో అనాథ యూదు బాలకులను అధికార్లు ఇస్లాము మతంలోకి చేర్చుకుంటూ ఉండేవాళ్ళు. కాని కొందరు యూదులు తమ జాతికి చెందిన అనాథ బాలకులను సానానగరం చేర్చి, ఒక ఉపాధ్యాయుడి వద్ద చదవ వేసేవారు. ఈ సంగతి సానాలోని ముస్లిము అధికార్లకు తెలియ వచ్చింది.

ఒక చిన్న ముస్లిము ఉద్యోగి ఒకనాడు యూదులవాడ తణిఖీ చేస్తూ వచ్చి, యూదు పిల్లల బడిలోకి తొంగి చూసి, ఉపాధ్యాయుడితో, "వీళ్ళంతా అనాథ బాలకులు కారూ?" అని అడిగాడు.

"వీళ్ళసలు గాడిదలు. నేను చదువు చెప్పి మనుషులను చేశాను," అన్నాడు ఉపాధ్యాయుడు. పిల్లలు ఉపాధ్యాయుణ్ణి బలపరచటానికి గాడిదలల్లే పెద్దగా ఓండ్ర పెట్టసాగారు.

ముస్లిముకు ఉపాధ్యాయుడి మాటలో గురి కుదిరింది.

"నా దగ్గిర ఒక ఒంటి కన్ను గాడిద ఉన్నది. దాన్ని నీ దగ్గర చదవేస్తాను. అది మనిషి కావటానికి ఎంతకాలం పట్టుతుంది?" అని అతను అడిగాడు.

"మూడేళ్ళు పట్టవచ్చు," అన్నాడు ఉపాధ్యాయుడు.

"ఇంతే కద? నేను మూడేళ్ళు ఆగ గలను. సంగతేమంటే, నా భార్య పిల్లల కోసం వాచిపోయి ఉన్నది. మా గాడిదను నువు మనిషిని చేశావంటే కొడుకులాగా పెంచుకుంటాం," అన్నాడు ముస్లిము.

అతను మర్నాడు ఉదయమే తన ఒంటి కన్ను గాడిదను తెచ్చి ఉపాధ్యాయుడికి అప్పగించాడు. ఉపాధ్యాయుడు అతనితో, "ఒక్క మాట గుర్తుంచుకో. ఈ విషయం ఎవ్వరికీ చెప్పకు. నువు నీ కొడుకును

ఇజ్రాయిల్ కథలు



చూడటానికి పొరపాటున కూడా రాకు. మూడేళ్ళయాక వచ్చి మీ వాణ్ణి పట్టుకుపో," అని చెప్పాడు.

ముస్లిము సంతోషించి వెళ్ళిపోయాడు. అతను మూడేళ్ళపాటు ఎలాగో తనను తాను నిగ్రహించుకుని ఆ చాయలకు పోలేదు. మూడేళ్ళు పూర్తి కాగానే, "ఏడీ మా వాడు? మావాడేడీ?" అంటూ ఉపాధ్యాయుడి దగ్గిరికి అదరాబాదరా పరిగెత్తుకు వచ్చాడు ముస్లిము.

"మీ గాడిద తెలివి తేటలు ఏమని చెప్పను! వాడి చదువు ఏనాడో పూర్తి అయింది. వాడిప్పుడు దిమార్‌లో న్యాయాధికారిగా పని చేస్తున్నాడు," అన్నాడు ఉపాధ్యాయుడు. దిమార్‌లోని న్యాయాధికారికి ఒకే కన్నని ఆయన తన మిత్రుల ద్వారా లోగడ విని వున్నాడు.

ముస్లిముకు పట్టరాని సంతోషం కలిగింది. అతను వెంటనే దిమార్ చేరి, న్యాయస్థానానికి వెళ్ళి, అక్కడ ఫిర్యాదులు విచారించే ఒంటి కన్ను న్యాయాధికారిని చూసి, "నేను గుర్తున్నానా, బాబూ? నువు నా ఒంటి కన్ను గాడిదవి!" అన్నాడు.

ఆ మనిషి పిచ్చివాడనుకుని న్యాయాధికారి అతన్ని వెంటనే వెర్రాసుపత్రికి పంపేశాడు.

* * *

ఒక బస్తీలో షఫికా అనే స్త్రీ ఉండేది. ఆమె భర్త హంగల్ వట్టి పిచ్చివాడు. షఫికా తెలివి గలది, అభిమానం గలది; ఇంటి వ్యవహారాలన్నీ తన తెలివి తేటలతోనే నిర్వహిస్తూ, తన భర్త అప్రయోజకుడన్న సంగతి, ప్రపంచానికి తెలియకుండా చూసుకుంటూ ఉండేది. తనకు ప్రయోజకుడైన భర్త దొరకక పోవటం తన దౌర్భాగ్యమని తనలో తానే విలపించేది.

ఒకనాడు షఫికాను చూడటానికి పొరుగున ఉండే రహమా అనే ఆమె వచ్చింది.



మాటల సందర్భాన రహమా, మగవాళ్ళ తెలివితేటలను గురించీ, సమర్థత గురించీ, అలాటి పురుషుల వల్ల సంసారాలకుండే లాభాలను గురించీ మాట్లాడింది.

అంతా విని షఫికా ఎంతో కాలంగా తన కడుపులో ఉన్న దుఃఖం రహమా దగ్గిర వెళ్ళబెట్టుకున్నది.

"మా అయనకు ఒక్కటీ చాతకాదు. అయన నాకు శాపంలాగా దొరికాడు. ఒక్క రోలీ సంపాదించలేడు. సంసారం నా ఒక్క చేతి మీదుగా ఈడవలేక సతమతమవుతున్నాననుకో. అయన ఎటువంటి మందమతో నువు ప్రత్యక్షంగా చూడవలిసిందే గాని చెబితే అర్థం కాదు," అని షఫికా తన భర్తను కేకేసి, "హంగల్, అటక మీది కెక్కి రొట్టె తీసుకురా. నీకు భోజనం పెడతాను," అన్నది.

హంగల్ వెళ్లి, "షఫికా, షఫికా! మెట్ల మధ్య ఉన్నాను. కిందికి దిగాలా, పైకి ఎక్కాలా?" అని కేక పెట్టాడు.

"చేతిలో రొట్టె ఉంటే దిగు. రొట్టె చేతిలో లేకపోతే పై కెక్కి, రొట్టె తీసుకుని కిందికి దిగిరా," అన్నది షఫికా.

హంగల్ చేతులు చూసుకున్నాడు; రొట్టె లేదు. పై కెక్కి రొట్టె తీసుకుని దిగి వస్తూ,



"షఫికా, షఫికా! మెట్ల మధ్య ఉన్నాను. పై నెక్కాలా, కిందికి దిగాలా?" అని అడిగాడు.

షఫికా ముందు చెప్పినట్టే చెప్పింది. హంగల్ చేతులు చూసుకుని, అందులో రొట్టె ఉన్నది గనక కిందికి దిగి వచ్చాడు.

"చూశావు గదా, రహమా? మా అయన ఇదీ వరస!" అన్నది షఫికా.

"ఈ భాగ్యానికే ఇంత విచారిస్తున్నావా? నీ భర్త చాలా నయమనుకో. నా భర్త సంగతి చూద్దువుగాని రా!" అంటూ రహమా షఫికాను వెంట బెట్టుకుని తన ఇంటికి తీసుకుపోయింది. ఇంటి దగ్గిర ఆమె తన



భర్త అయిన షిమోన్‌కు ఒక జాడీలో నీళ్లు పోసి ఇచ్చి, "ఈ గోధుమలను మర పట్టించుకురా," అన్నది.

షిమోన్ నీళ్ళ జాడీని పిండిమరకు తీసుకుపోయి, మరవాడితో, "ఈ గోధుమలు పిండి పట్టు," అంటూ ఇచ్చాడు.

షిమోన్ పిచ్చివాడని గ్రహించి, "చేతి నిండా పని ఉన్నది. నువు వెళ్ళి ఆ నిద్ర పోయే వాడి పక్కన పడుకో. పిండి పట్టాక లేపుతాను," అన్నాడు మరవాడు. అక్కడ ఒక విదేశీయుడు నిద్రపోతుంటే షిమోన్ వాడి పక్కన పడుకుని నిద్రపోయాడు.

నిద్రలో ఉండగా మరయజమాని షిమోన్ గడ్డం కత్తిరించి, విదేశీయుడి టోపీ షిమోన్ నెత్తిన పెట్టి, అతన్ని నిద్రలేపి, జాడీ ఇచ్చి, "నీ గోధుమలు పిండి పట్టాను. ఇక ఇంటికి వెళ్ళు," అన్నాడు.

షిమోన్ ఇంటికి రాగానే అతని అవతారం చూసి రహమా గాని, షఫికా గాని గుర్తు పట్టలేదు. "ఎవరు నువు? ఎక్కణ్ణుంచి వస్తున్నావు?" అని రహమా అతన్ని అడిగింది.

"మీ ఇద్దరిలో ఎవరో ఒకరికి మొగుణ్ణి! మీలో నా పెళ్ళాం ఎవరైనదీ సరిగా గుర్తు రావటం లేదు," అన్నాడు షిమోన్.

"మేము నిన్నెరగం," అంటూ రహమా అతని కొక అద్దం ఇచ్చింది.

షిమోన్ అందులో తన మొహం చూసుకుని, "ఆ మర ఆడించే గాడిద నన్ను లేపి పిండి ఇవ్వటానికి బదులు, ఆ విదేశీయుణ్ణి లేపి వాడికిచ్చాడు. నే నింకా అక్కడే పడుకుని నిద్ర పోతున్నానులాగుంది. ఇప్పుడే వెళ్ళి, నన్ను లేపమని మర ఆడించే ఆ గాడిదతో చెబుతాను," అంటూ వెళ్ళిపోయాడు.

తన మొగుడే అనుకుంటే, రహమా మొగుడు అంతకంటె కూడా వెర్రివాడని షఫికా తెలుసుకున్నది.





# కృష్ణావతారం

బాణుడి నగరాన్ని చూస్తున్న కృష్ణుడి దగ్గిరికి నారదుడు వచ్చి, "చూశావా, కృష్ణా? ఈ పట్టణాన్ని పార్వతీ సమేతుడైన శివుడు స్వయంగా కాపాడుతున్నాడు. అందుచేత నీకు కార్యసిద్ధి అయే మార్గం జాగ్రత్తగా చూసుకో," అన్నాడు.

దానికి కృష్ణుడు చిరునవ్వు నవ్వి, "మా పనికి ఈశ్వరుడే అడ్డపడినా సంతోషమే. మా శక్తి కొద్దీ మా ప్రయత్నం చేస్తామే గాని, వెనక్కు తిరిగి పోయి, కార్యహాని కానియ్యం," అన్నాడు.

ఇలా అంటూనే కృష్ణుడు నగరద్వారం వద్దకు వెళ్ళి, పాంచజన్యం పూరించాడు. ఆ నాదం చెవుల పడుతూనే బాణుడి సేనలు మహాసముద్రంలాగా వచ్చి పడ్డాయి. కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ, గరుత్మంతుడూ కూడా విజృంభించి ఆ రాక్షససేనలను దారుణంగా చెండాడారు. చచ్చిన వాళ్ళు చావగా మిగిలిన వాళ్ళు నగరంలోకి పారిపోసాగారు.

అప్పుడు వాళ్ళను చూసి బాణుడు, "రాక్షసవీరులై పుట్టి, యుద్ధాలలో ఆరితేరి కూడా మీరిలా పారిపోయి వస్తున్నారా? నేను లేనా? నా మంత్రి కుంభాండుడు లేడా? ప్రమథగణాలు లేవా? మన ముందు ఈ శత్రువు ఎంత? ఆగండి! నిలవండి!" అన్నాడు. కుంభాండుడు కూడా వారిని హెచ్చరించాడు. కాని అందువల్ల ప్రయోజనం లేకపోయింది. రాక్షససేనలు ఆగకుండా పారిపోయాయి.

27. బాణుడి పరాభవం



ఈ విధంగా తన భక్తుడైన బాణుడికి కలిగిన అవమానం చూసి శివుడికి ఆగ్రహం వచ్చింది. ఆయన యుద్ధానికి సిద్ధమై, సింహాలు పూన్చిన రథం మీద వృషభ ధ్వజం ప్రకాశిస్తూండగా, నందిని సారథిగా పెట్టుకుని, కుమారస్వామిని కూడా వెంట బెట్టుకుని, ప్రమథవీరులు వెంట రాగా అట్టహాసంగా బయలుదేరాడు.

శివుడూ కృష్ణుడూ యుద్ధం ఆరంభించారు. ఆరంభంలోనే శివుడు కృష్ణుడిపైన నూరు బాణాలు వేశాడు. దానికి సమాధానంగా కృష్ణుడు ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. దాని నుంచి వేలకొద్దీ బాణాలు వెలువడి శివుడి రథాన్ని కప్పేశాయి. అప్పుడు శివుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించేసరికి, చుట్టూ మంటలు పుట్టు కొచ్చి బాణాలన్నిటినీ తగల బెట్టేశాయి. ఆ తరవాత అవి తననూ, బలరాముణ్ణీ, ప్రద్యుమ్నుణ్ణీ, గరుత్మంతుణ్ణీ చుట్టు ముట్టుతూంటే కృష్ణుడు వారుణాస్త్రం వేసి ఆ జ్వాలలను చల్లార్చాడు.

అటు పైన శివుడు దారుణమైన అస్త్రాలను అయిదారింటిని ప్రయోగిస్తే వాటన్నిటినీ నిర్వీర్యం చేయగల అస్త్రాలను కృష్ణుడు ప్రయోగించి, చివరకు వైష్ణవాస్త్రాన్ని మంత్రయుక్తంగా ప్రయోగించాడు. ఆ మహాస్త్రాన్ని ఎలా ప్రతిఘటించాలో పాలుపోక శివుడు అమిత కోపంతో యుగాంతకమై, ప్రళయభయంకరమైన పాశుపతాస్త్రాన్ని పైకి తీశాడు.

శివుడి ఉద్దేశాన్ని గ్రహించి కృష్ణుడు అతి వేగంగా జృంభకాస్త్రాన్ని ప్రయోగించాడు. మరుక్షణమే శివుడికి చెప్పరాని నీరసమూ, ఆవలింతలూ వచ్చేశాయి. చేతి నుంచి ధనుర్బాణాలు పడిపోయాయి.

ఆ సమయానికే బాణుడు కూడా యుద్ధ రంగానికి వచ్చి ఉన్నాడు. అతను శివుడికి చైతన్యం కలిగించాలని ప్రయత్నించాడు గాని, ప్రయోజనం లేకపోయింది. కృష్ణుడు

దిక్కులు మారుమోగేలాగా పాంచజన్యం పూరించాడు.

ఇదంతా చూసి ప్రమథులకు చాలా కోపం వచ్చింది. వారు ప్రద్యుమ్నుణ్ణి చుట్టుముట్టి ఆయుధాలతో ముంచివేశారు. రాక్షసులు కూడా అతని పైన మాయాయుద్ధం సాగించారు. ప్రద్యుమ్నుడు అలిగి సమ్మోహన విద్యతో వారందరికీ నిద్ర తెప్పించి, అనేకమంది రాక్షసులను చంపాడు.

ఈ లోపల కుమారస్వామి, తన తండ్రి యుద్ధ విముఖుడు కావటం చూసి, తానే ఆ స్థానంలో యుద్ధం చేయ బూనాడు. అతను కృష్ణబలరామ ప్రద్యుమ్నులతో పోరాడుతూ, వారిని తీవ్రంగా గాయపరచి, తానూ గాయపడ్డాడు. కుమారస్వామి అలిగి కృష్ణుడి పైన బ్రహ్మశిరోనామాస్త్రం ప్రయోగిస్తే కృష్ణుడు తన సుదర్శనచక్రంతో దాన్ని నిర్మూలించాడు. ఆ వెంటనే అతను కుమారస్వామి పైన తన చక్రాన్ని ప్రయోగించేసరికి, అది వచ్చి కుమారస్వామికి తగిలే లోపల లంబాదేవి అనే ఒక దేవతాస్త్రీ వచ్చి కుమారస్వామిని యుద్ధరంగం నుంచి తీసుకుపోయింది.

తనకు అంగరక్షగా ఉన్న వారంతా ఈ విధంగా తొలగిపోగా, యుద్ధం ద్వారా



తన చేతుల తీట తీరే అవకాశం దొరికిందని సంతోషించి బాణుడు తానే స్వయంగా కృష్ణుడితో యుద్ధానికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో బాణుడి రథమూ, ఆయుధాలూ నుగ్గయాయి, టెక్కెం విరిగి పడింది. రొమ్ములో నుంచి కృష్ణుడి బాణం దూసుకుపోయి బాణుడు మూర్ఛిల్లాడు.

ఆ స్థితిలో కృష్ణుడి చక్రాయుధానికి బలిగానున్న బాణుణ్ణి కాపాడటానికి శివపార్వతులు మళ్ళీ లంబాదేవినే పంపారు. ఆమె వచ్చి బాణుడికి అడ్డంగా నిలబడింది. అదృశ్యంగా పార్వతి కూడా అక్కడే నిలబడింది.



అప్పుడు కృష్ణు డామెను చూసి, "దేవీ, ఎందుకీ కుయుక్తులు? నువు అడ్డంగా నిలిచి నంత మాత్రాన నేను శత్రువును ప్రాణా లతో వదులుతా ననుకున్నావా?" అన్నాడు.

ఆ మాటకు పార్వతి, "నువు సమర్థు డివి. ఏం చేసినా నేను నిన్ను అడ్డలేను. కాని ఈ బాణుణ్ణి నేను నా కొడుకుగా పెంచుకున్నాను. నాకు పుత్రశోకం కలి గిస్తావా? వీణ్ణి కాయి," అన్నది.

దానికి కృష్ణుడు, "తల్లీ, వీడు తన వెయ్యి చేతులు చూసుకుని మదించి, విర వీగుతున్నాడు. రెండు చేతులే ఉంచి, మిగిలినవన్నీ నరికేస్తేనే గాని వీడి దర్పం అణగదు. అప్పుడు వీడి రాక్షసత్వం పోయి, నీ అండన బతికే కొడుకులాగే మిగులు తాడు. అడ్డం రాకు," అన్నాడు.

పార్వతి లంబాదేవిని అడ్డం తొలగ మన్నది. పార్వతీదేవితో బాటు లంబాదేవి కూడా అంతర్ధానం కాగానే, కృష్ణుడు తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. అది వెళ్ళి, బాణుడికి రెండు చేతులను మాత్రం మిగిల్చి, మిగిలిన చేతులన్నిటినీ ఖండించి, కృష్ణుడి చేతికి తిరిగి వచ్చింది.

అప్పటికీ బాణుడి పౌరుషం చావలేదు. అతను తనకు మిగిలిన రెండు చేతులతోనే ధనుర్బాణాలు తీసుకుని, కృష్ణుడిపై బాణ వర్షం కురిపించాడు. కృష్ణుడు ఆగ్రహించి తిరిగి చక్రాన్ని ప్రయోగించబోయేటంతలో శివుడు తన పరివారంతోసహా వచ్చి, "కృష్ణా, వీడు నా సంరక్షణలో ఉన్నవాడు. వీణ్ణి చంపి, నా అభయ దానాన్ని వ్యర్థం చెయ్యకు. నీ చక్రాన్ని ఉపసంహరించు," అని కోరాడు.

కృష్ణుడు బాణుణ్ణి చంపే ప్రయత్నం మానుకుని, శివుణ్ణి కీర్తించి, గరుత్మంతుణ్ణి ఎక్కి, అనిరుద్ధుడున్న చోటికి వెళ్ళాడు. నందికేశ్వరుడు బాణుణ్ణి శివుడి దగ్గిరికి చేర్చాడు. శివుడు బాణుడికి చేతులు పోయిన

బాధ మాన్పి, అతనికి ప్రమథులలో చాలా ఉన్నతమైన స్థానం ఇచ్చి, నందికి సమమైన హోదా ఇచ్చాడు. బాణుడి పేరు మహాకాళుడుగా మారిపోయింది. శివుడు అంతర్థానమయాడు.

అక్కడ గరుత్మంతుణ్ణి చూడగానే అనిరుద్ధుణ్ణి పాముల రూపంలో బంధించిన బాణాలన్నీ, తిరిగి బాణాల రూపం పొంది పడిపోయాయి. అక్కడికి నారదుడు వచ్చాడు, చిత్రరేఖ కూడా వచ్చింది. కృష్ణ బలరామ ప్రద్యుమ్నులు అనిరుద్ధుణ్ణి కౌగలించుకున్నారు. అతను వాళ్ళకు భక్తితో నమస్కారాలు చేశాడు.

నారదుడు కృష్ణుణ్ణి చూసి, "ఇంకా ఆలస్యం దేనికి? అబ్బాయికి వివాహం చేసెయ్యి," అన్నాడు.

ముహూర్తం కూడా సమీపంలోనే ఉన్నది. కుంభాండుడు పెళ్ళి ప్రయత్నాలన్నీ పూర్తి చేసి వచ్చి, కృష్ణుడికి నమస్కారం చేసి, "నన్ను తమరు అనుగ్రహించి కాపాడాలి," అన్నాడు.

కృష్ణుడు అతనితో, "నువు చాలా యోగ్యుడవని విన్నాను. బాణుడి సర్వస్వమూ నువే తీసుకుని నిశ్చింతగా అనుభవించు," అన్నాడు.



తరవాత ఉషానిరుద్ధులకు వైభవంగా వివాహం జరిగింది. కృష్ణుడు నూతన వధూవరులను శివపార్వతులున్న చోటికి తీసుకుపోయి, వారికి నమస్కారాలు చేయించాడు. ఆ ఆదిదంపతులు వారిని ఆశీర్వదించారు. పార్వతి అనిరుద్ధుడికి వాహనంగా బాణుడి నెమలినే ఇచ్చింది.

ఆ సమయంలో కుంభాండుడు, కృష్ణుడు బయలుదేరి పోబోతూండగా, "బాణుడి ఆవులమందలు వరుణుడి దగ్గిర ఉన్నాయి. వాటి పాలు తాగితే ఎంతో బలవీర్యాలు కలుగుతాయి. వాటిని తమరు స్వాధీనపరుచుకోవటం మంచిది," అన్నాడు.



ఇకనేం? కృష్ణుడు గరుత్మంతుడి మీద తనతోబాటు అన్ననూ, కొడుకునూ తీసుకుని పడమటి సముద్ర తీరానికి అతి వేగంగా వెళ్ళి, అక్కడి వనాలలో తిరుగుతున్న గోవులను అనేక లక్షల సంఖ్యలో చూశాడు. గోవులను మాలిమి చేసుకోవటం తనకు చిన్నతనం నుంచీ అలవాటైన విద్యే గనక, కృష్ణుడు నేల మీద దిగి ఆ గోవుల దగ్గరికి వెళ్ళాడు. అవి గబగబా సముద్రంలో ప్రవేశించి, అదృశ్యమయాయి.

కృష్ణుడు నిరాశ చెంది గరుత్మంతుడితో, "నా ప్రయత్నం ఇలా గయిందేమిటి? ఇప్పుడు ఏం చెయ్యాలి?" అన్నాడు.

"చేసేటందు కేమున్నది? వరుణుడితో యుద్ధం చేయక తప్పదు!" అన్నాడు గరుత్మంతుడు.

అతను రెక్కలతో బలంగా విసిరేసరికి సముద్రపు నీరు తొలగి, అడుగున నాగలోకం దాకా దృగ్గోచరమయింది. కృష్ణుడు పాంచజన్యం పూరిస్తూ వరుణుడి ఇంటి మీదికి ఎత్తి వెళ్ళాడు.

మరుక్షణమే శంఖాలు ఊదుతూ, అరవై ఆరు రథాల మీద వరుణుడి భటులు కృష్ణుడి పైకి వచ్చారు. కృష్ణుడు వారితో దారుణమైన యుద్ధం చేశాడు. అతనికి సహాయంగా బలరాముడూ, ప్రద్యుమ్నుడూ కూడా పోరాడారు. గరుత్మంతుడు కూడా వారికి సహాయం వెళ్ళాడు. ఈ నలుగురూ చేసిన యుద్ధానికి తట్టుకోలేక వరుణుడి భటులు పారిపోయారు.

"కృష్ణుడు ఇంత పని చేస్తాడా?" అని ఆగ్రహించి వరుణుడు స్వయంగా యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడికీ వరుణుడికీ జరిగిన యుద్ధంలో కృష్ణుడు వైష్ణవాస్త్రం ప్రయోగించేసరికి వరుణుడు, ప్రాణం మీదికి వచ్చి, కాళ్ళ బేరానికి దిగాడు.

"నన్ను శరణు వేడినంత మాత్రాన లాభం లేదు. నీ దగ్గిర ఉండే బాణుడి

పశువులను ముందు నా పరం చెయ్యి," అన్నాడు కృష్ణుడు.

"అది మాత్రం అడగవద్దు. బాణుడు తన పశువులను నాకు అప్పగించేటప్పుడు, ప్రాణం ఉన్నంత దాకా యుద్ధమైనా చేస్తాను గాని వాటిని ఎవరికీ ఇవ్వనని ప్రమాణం చేశాను. ఉన్నమాట చెప్పాను. తరవాత నీ కెలా తోస్తే అలాగే చెయ్యి," అన్నాడు వరుణుడు.

కృష్ణుడు పశువుల మీది ఆశ వదులుకుని తన దివ్యాస్త్రాన్ని ఉపసంహరించాడు. వరుణుడు కృష్ణుడికి అతిథి మర్యాదలు చేసి తన లోకం నుంచి సాగనంపాడు.

వరుణుడికి వీడ్కోలు చెప్పి, కృష్ణుడు బలరామ ప్రద్యుమ్న అనిరుద్ధులతో సహా గరుడవాహనం మీద తన నగరాన్ని చేరుకుని, విజయసూచకంగా పాంచజన్యం పూరించాడు. అది విని యాదవ ప్రముఖులు పెద్ద బలగాన్ని వెంటబెట్టుకుని ఎదురు వచ్చారు. వారు వచ్చేసరికి కృష్ణుడు నగరం వెలపల ఉండే ఉద్యానాలలో దిగి, విహరిస్తున్నాడు. అతని వెంట ఇంద్రాది దేవతలు కూడా ఉన్నారు. యాదవులు వారినందరినీ వైభవోపేతంగా రథాలలో నగరంలోకి తీసుకుపోయారు. కృష్ణుడు విజయుడై తిరిగి వచ్చాడన్న వార్త తెలిసి పురజనులు వీధుల వెంబడి కిక్కిరిసి నిలబడ్డారు. కృష్ణుడు శోణపురంలో అగ్నులను జయించటమూ, శివుణ్ణి నిగ్రహించటమూ, పార్వతికి పుత్రభిక్ష పెట్టటమూ, బాణుణ్ణి చేతులు నరికి ప్రాణాలతో వదలటమూ మొదలైన వృత్తాంతాలు వారు చెప్పుకుంటున్నారు. వాళ్ళ మాటలు చెవిని పడుతుంటే కృష్ణుడికి ఆనందం కలిగింది.

నగరు చక్కగా అలంకరించి ఉన్నది. అక్కడికి చేరగానే కృష్ణుడు తన మందిరానికి వెళ్ళిపోయాడు; ఉషానిరుద్ధులు తమ మందిరానికి వెళ్ళారు.





# అరణ్యపురాణం

## 30

మౌగ్లీ తమను తప్పించుకుని పారిపోతూం డటం కళ్ళబడగానే శునకులు ఒక్క పెడబొబ్బ పెట్టి అతడి వెనకగా దౌడు సాగించారు.

మౌగ్లీ తేలికగా, ఆయాసం రాకుండానే పరిగెత్తాడు. తేనెపట్లు దగ్గిర పడినప్పుడు అతను తన శక్తి అంతా వ్యయపరచ నిశ్చయించుకున్నాడు.

తేనెటీగలు మసకవెలుతు రుండగానే నిద్రపోయాయి. ఎందుకంటే పొద్దుపోయాక పూలు వికసించే ఋతువు కాదది. అయినా మౌగ్లీకి, తేనెపట్లకు కొంత దూరంలో ఉండ గానే, మృదువైన ఝుంకారం వినిపించింది. అప్పు డతను తన శక్తి కొద్దీ పరిగెత్త నారంభించాడు. పరిగెత్తేటప్పుడు తన కాలితో, తాను పేర్చి ఉంచిన రాళ్ళకుప్పను కనుమ లోకి నెట్టేశాడు. మృదువైన ఝుంకారం కాస్తా భయంకరమైన హోరుగా మారింది. గాలిలో తేనెటీగలు నల్లని మేఘంలా కాన వచ్చాయి. దిగువన చాలా లోతుగా వాయిన్ గంగ ఉన్నది. అందులో కావా తల కూడా "డైమండ్" ఆకారంలో కనిపించింది.

మౌగ్లీ ఒక్క ఊపున నదిలోకి గెంతే శాడు. తోక లేని శునకనాయకుడు ఎగిరి అతని వీపును కరవ యత్నించాడు. మౌగ్లీ తన విజయానికి చాలా ఉప్పొంగిపోయాడు. అతని శరీరం పైన ఒక్క ఈగకాటు లేదు. అంతా అనుకున్నట్టు సక్రమంగా జరిగి పోయింది. వెల్లుల్లి వాసన ఈగల నుంచి అతన్ని కాపాడింది.

మౌగ్లీ నీటి పైకి లేచేసరికి కావా శరీరం అతన్ని పొదవటానికి సిద్ధంగా ఉంది. కొండ పై అంచు నుంచి శునకుల శరీరాలు కనుమలోకి పడుతున్నాయి. అవి చూడటా

అట్ట చివరి బొమ్మ





బడ్డారు ; వాటి కాట్లకు తట్టుకోలేక నదిలోకి దూకేశారు.

మౌగ్లీకి శ్వాస తిరిగి వచ్చిన దాకా ఆగి కావా, "ఈగలు చాలా కోపంమీద ఉన్నారు. మనం ఇక్కడ నిలవటం క్షేమం కాదు," అని చెప్పాడు

మౌగ్లీ తన కత్తిని చేతపట్టుకుని, ప్రవాహం వెంబడి ఈదసాగాడు. సాధ్యమైనంతవరకు అతను నీటి అడుగునే ఉంటూ ఈదాడు.

"జాగ్రత్త, నీటిలోకి దూకిన శునకులందరూ చావలేదు," అన్నాడు కావా.

"కత్తి సిద్ధంగానే ఉన్నది," అని మౌగ్లీ జవాబిచ్చాడు. ఈగలు ప్రవాహం వెంట రావటం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

శునకుల తండాలో సగం భాగం అపాయం తెలుసుకుని, పక్కలకు పరిగెత్తి నదిలోకి దూకేసింది. వాళ్ళ మొరుగు వినిపిస్తున్నది. ప్రాణాలు దక్కించుకున్న శునకులు మౌగ్లీ చేసిన ద్రోహన్ని మరవలేదు. నీటిలో పడినా ఈగలు వాళ్ళను వెంటాడుతూనే ఉన్నాయి. మౌగ్లీ తనకు అందిన శునకుణ్ణి పట్టుకుని కత్తితో చంపేస్తున్నాడు.

"శాంతిశిల" సమీపిస్తున్న కొద్దీ సియోనీ తోడేళ్ళమంద అరుపు మరింత స్పష్టంగా

నికి తేనెటీగల తుట్టెల లాగా ఉన్నాయి. శునకుల శరీరాలు నీటిని చేరుకునేలోపల ఈగలు పైకి ఎగిరిపోతున్నాయి; కళేబరాలు ప్రవాహం వెంబడి కొట్టుకుపోతున్నాయి.

ఇంకా సముద్రపు హెూరు లాంటి ఈగల ధ్వని వినవస్తూనే ఉన్నది. ఎగువ నుంచి శునకుల మొరుగుడు కూడా వినిపిస్తున్నది. శునకులలో కొందరు మాత్రమే కనుమలోకి పడిపోయి, ప్రవాహంతో కొట్టుకుపోయారు. కొందరు పైన వున్న నెర్రెలలో పడి, దిగువ నుండే గుహలలోకి జారి, అక్కడ ఈగల వాత పడ్డారు. కొందరు శునకులు చెట్లు ఎగబాకబోయి, ఈగల చేత ఆవరించ







వినిపిస్తున్నది. ఒడ్డుకు దారితీయమని శునకులు తమ నాయకుణ్ణి అడుగుతున్నారు. తేనెటీగలు వెనక్కు తిరిగిపోయాయి. "ఇక నేను కూడా వెళ్ళిపోతాను. నాకు తోడేళ్ళతో ఏమిటి సంబంధం? వేట సాగాలి, తమ్ముడూ!" అని కావా వెళ్ళిపోయాడు.

శునకులు తడిసి ముద్ద అయి, ఉత్సాహన్ని కోల్పోయి, ఒకరొకరే ఒడ్డు చేరసాగారు. కుంటికాలితో గెంతుతూ ఏకాకి ఒడ్డునే ఉన్నాడు.

"ఈ వేట బాగాలేదు," అన్నా డొక శునకుడు రొప్పుతూ.

"భలే వేట!" అంటూ మౌగ్లీ ఆ శునకుడి పక్కకు దూకి, తన కత్తిని శునకుడి గుండెల్లోకి దింపి, శునకుడి చివరి కాటు నుంచి తప్పుకున్నాడు.

"నువేనా, మనిషికూనా?" అని ఏకాకి కేకపెట్టాడు.

"చచ్చిన శునకుల నడుగు, ఏకాకీ! వాళ్ళ నోట మట్టికొట్టాను. వాళ్ళ నాయకుడికి తోక లేకుండా చేశాను. నీ కోసం కొందరు మిగిలారులే!" అన్నాడు మౌగ్లీ

"రానీ!" అన్నాడు ఏకాకి.

తోడేళ్ళమంద వాళ్ళకు చాలా సమీపంలోకి వచ్చింది.

నది మలుపు తిరిగే చోట శునకులు ఒడ్డు పట్టారు. అది పొరపాటు. ఇంకొక అరమైలు దిగువన వాళ్ళు ఒడ్డు పట్టి ఉండవలసింది. వాళ్ళ కోసం తోడేళ్ళు చింత నిప్పుల్లాటి కళ్ళతో వేచిఉన్నారు. ఏకాకి కనిపించటంతో నాయకుడు శునకులను ఒడ్డు పట్టించాడు.

సుదీర్ఘమైన యుద్ధం ఆరంభ మయింది. ఇప్పటికీ శునకుల సంఖ్య తోడేళ్ళ సంఖ్యకు రెట్టింపున్నది. కాని తోడేళ్ళు అన్నిటికీ తెగించి ఉన్నారు—ఆడవాళ్ళతోనూ, పిల్లలతోనూ సహా. శునకులు యుద్ధంలో పొట్టలు చీల్చేస్తారు. తోడేళ్ళు కంఠాలు కొరికేస్తారు,

లేదా డొక్కలు చీలుస్తారు. నీటిలో నుంచి మోరలెత్తి బయటికి వచ్చే శునకుల కంఠాలు తోడేళ్ళకు సులువుగా అందాయి. కాని శునకులు పైకి వచ్చాక బలం వాళ్ళదే అయింది.

పోరాటాన్ని చూస్తూ ఉన్న మౌగ్లీని అన్నలు నలుగురూ పొదువుకున్నారు. వాళ్ళ కేసి దూకిన శునకులను మౌగ్లీ తన కత్తికి బలిచేశాడు. అతి వృద్ధుడైన అకేలా, సగం చచ్చిన ఏకాకీ, కొత్తనాయకుడు ఫావో ఎంతో సాహసంతో పోరాడారు. శునక నాయకుడు చిక్క క చిక్క క ఏకాకికే చిక్కాడు! మౌగ్లీ సహాయం పోబోతే ఏకాకి, "అగు, ఇది నా పంతు!" అన్నాడు.

ఏకాకి మహావీరుడు. శునక నాయకుణ్ణి చంపి మరీ చచ్చాడు. ఏకాకి చావగానే మౌగ్లీ మిగిలిన తోడేళ్ళను హెచ్చరించుతూ, "ఒక్క శునకుణ్ణి కూడా ప్రాణాలతో వదలకండి!" అని అరిచాడు.

అకేలా ప్రాణాలతో ఉండగానే మౌగ్లీ కంట పడ్డాడు.

"ఇది నా ఆఖరు పోరాటమని ముందే చెప్పాను. ఇవాళ నువు లేకపోతే ఈ మందలో ఒక్కరు మిగిలి ఉండరు. నువ్వికా నీ వాళ్ళ దగ్గిరికి తిరిగి వెళ్ళు. అన్ని ఋణాలూ పూర్తిగా తీరిపోయాయి," అన్నాడు అకేలా.

మౌగ్లీ అకేలా ఒంటిని పొదివి పట్టుకుని నిలబెట్టాడు. ఒకప్పుడు మందకు నాయకుడైన అకేలా చావుపాట పాడాడు. అతని కంఠం అంతకంతకూ బలమెక్కి, నది దాటి చాలాదూరం వినిపించింది.

"వేట సాగాలి!" అంటూ అకేలా తన బలమంతా కూడగట్టుకుని గాలిలోకి ఎగిరి, వెల్లికిలా పడిపోయాడు. అతని ప్రాణం పోయింది.

ఆ రాత్రి జరిగిన యుద్ధంలో ఒక్క శునకుడు కూడా ప్రాణాలతో మిగలలేదు.



# 84. ప్రాచీన అలెప్పో దుర్గం

సిరియాలోని ఈ దుర్గం ఒక కొండ మీద నిర్మించబడి శతాబ్దాల తరబడి దుర్భేద్యంగా ఉండిపోయింది. ఇస్లాము-క్రైస్తవమత యుద్ధాలప్పుడు క్రైస్తవసేనలు దీనిని ముట్టడించి కూడా జయించలేకపోయాయి. హిట్టైటుల కాలం నుంచీ, ఈజిప్షను ఫారావోల కాలం నుంచీ కూడా దీని కోసం కుట్రలూ, యుద్ధాలూ, హత్యాకాండలూ సాగాయి. అనేకమార్లు ప్లేగువ్యాధికీ, భూకంపాలకూ గురి అయిన ఈ దుర్గం నాలుగువేల సంవత్సరాల చరిత్ర గలది. దీనిలోని మార్గాలు భూగర్భసొరంగాలే.



Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

గోటి కోసం

పంపినవారు:
ఎ. వి. ఎల్. నరసింహారావు, ఖమ్మం

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

కూటి కోసం

పంపినవారు:
ఎ. వి. ఎల్. నరసింహారావు, ఖమ్మం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 జనవరి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: గోటి కోసం

రెండవ ఫోటో: కూటి కోసం

పంపినవారు: ఎ. వి. ఎల్. నరసింహారావు,

C/o డివిజనల్ ఇంజనీర్: ఎలక్ట్రికల్ ఆపరేషన్, ఖమ్మం.

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# దిలీప్ అతడి స్నేహితులు

చేపలు పట్టే అద్భుతకథ

కన్నులు చెదరిపోయే ఎర్రటి షర్టుతొడిగావేం సురేష్— ఎద్దులతో పోట్లాడటానికి వెళ్ళటంలేదుగా ?

ఈ రోజు మనకేం చేపలు దొరకకపోతే నిన్ను విడవకుండా చేయటానికి



అరగంట తరువాత.....

పడింది పెద్దది! కదలకు....కదలకు....

ఇప్పుడు మెల్లిగాచుట్టు— తీయి గాలపు కర్రను గట్టిగా పట్టుకో!



అయిదుగురు ఇంటికి బుట్టెడు చేపలతో బయలుదేరేటప్పటికి చీకటి పడింది దిలీప్ ముందు నడుస్తున్నాడు. తన చేతిలో ఎవరెడీ బ్యాటరీని ఆడించుకుంటూ









అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైన శక్తి, అది ముమ్మాటికీ 'ఎవరెడి'

# దిలీప్ అతడి స్నేహితులు

చేపలు పట్టే అద్భుతకళ









అయిదుగురు ఇంటికి బుట్టెడు చేపలతో బయలుదేరేటప్పటికి చీకటి పడింది దిలీప్ ముందు నడుస్తున్నారు. తన చేతిలో ఎవరెడీ బ్యాటరీని ఆడించుకుంటూ







**అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైన శక్తి, అది ముమ్మాటికీ 'ఎవరెడీ'**

